

హెన్రీ రూసో

# చిత్రకారుని గురించి

హెన్రీ రూసో (1844-1910) సంప్రదాయ పద్ధతులకు అలవాటుపడని అత్యంత ప్రఖ్యాత చిత్రకారులలో ఒకరు. అతడు పారిస్‌లో టోల్‌గేట్ల పన్నులు వసూలు చేసే అధికారిగా పనిచేశాడు. ఖాళీ సమయాలలో చిత్రలేఖనం చేసేవాడు. తన ఉద్యోగ కాలం పూర్తి కాకముందే కళకోసం పదవీ విరమణ చేశాడు. మామూలు జనానికి అర్థంకాని అతని కళ అతనికి మంచి పేరుతెచ్చిపెట్టకపోగా, ఎగతాళికి గురిచేసింది అంతేకాదు అతనికి ఆర్థిక ఇబ్బందులు ఎదురయ్యాయి. కళాకారునిగా తన శక్తుల మీద తనకున్న అపార అచంచల విశ్వాసం ఆ కష్టాలను, ఎగతాళిని సహించేట్టు చేసింది.

ప్రామాణికంగా, వైధికంగా, సైద్ధాంతికంగా చిత్రలేఖనం చేయాలని అతని కోరిక కాని అతని కళను సంప్రదాయవాదులు మెచ్చుకోలేదు అయితే మేధావులు, కళాకారులలో వైతాళికులు - గాగిన్, పికాసోలాంటి అల్పసంఖ్యాక వర్గం మాత్రం ఆయన కళను ప్రశంసించింది. వారు మెచ్చుకుంది అతని శీలంలో, కళలో దోబూచులాడే 'బాల సదృశ, అమాయకత'ను నేటికిగూడా ఈ లక్షణం కారణంగానే అతనిని గౌరవిస్తారు

ఇతడు 1844 మే 21వ తేదీన ఫ్రాన్స్‌కు వాయువ్యంగా ఉన్న లావల్‌లో జులియన్ దంపతులకు జన్మించాడు తలిదండ్రులకు చిత్రలేఖనం అంటే ఆసక్తిలేదు తన కళను వారు పట్టించుకోలేదని తరవాత వాపోయాడు కళాకారునిగా తనలో రేగిన 'కళావేశం' అంతా మెక్సికన్ అడవుల 'వృక్ష జీవితం' నుంచి వచ్చిందని ఆయన చెప్పుకొన్నాడు.

ముఖ చిత్రం : 'నిద్రిస్తున్న జిప్సీ' జులై 10, 1898 నాడు లావల్ నగర మేయర్‌కు నిద్రిస్తున్న జిప్సీ (Sleeping Gypsy) ని, ఆ నగర పౌరుడు చిత్రించిన చిత్రంగా అమ్మజూపాడు. కాని నగర మేయర్ ఆ ప్రతిపాదనను తిరస్కరించాడు కాని రూసో ప్రతిపాదన ఉత్తరం చిత్రకారుని సొంత మాటల్లో ఆ చిత్రమేమిటో వివరిస్తుంది రూసో దానిని ప్రాచ్యశైలిలో 'వాస్తవిక' కళాఖండంగా చూశాడు అందులో ఒక సంచార నీగ్రో యువతి మాండలిన్‌ను వాయిస్తూ, ప్రక్కన మంచినీటి కూజాను పెట్టుకొని, అలసి సొలసి గాఢంగా నిద్రపోతున్నది అటుగా ఒక సింహం వెళ్తూ వెళ్తూ ఆమెను వాసన చూస్తుందేగాని, తినదు ఈ చిత్రంలో కనిపించే వెన్నెల 'కవితాత్మ'ను ప్రదర్శిస్తుంది ఆదృశ్యం మండుటెండల ఎడారిలోది జిప్సీ ప్రాచ్య వేషధారణ చేసింది దురదృష్టవశాత్తు ఈ 'వెంటాడే కళాఖండం' అతడు బ్రతికి వున్న రోజులలో వెలుగు చూడలేదు 1923లో అది పారిస్‌లో ఒక పంపులు బాగుచేసే కొట్టులో దొరికింది

నాలుగో అట్టమీది చిత్రం : 'నిద్రిస్తున్న జిప్సీ' రూసో చిత్రించిన అత్యంత అసాధారణ కళాఖండాల్లో ఇది ఒకటి. దాని అర్థంగాని మార్మిక లక్షణాలు అనేక వ్యాఖ్యానాలకు దారితీస్తాయి. అధి వాస్తవికవాదులు దీనిని చూసి రూసో తమవాడే అనుకొన్నారు ఎందుకంటే అందులో అనూహ్య మానవ, జంతు, నిశ్చల జీవితం, స్థల దృశ్యం ప్రక్కప్రక్కనే కనిపించాయి. ఫ్రాయిడ్ అనుయాయులు అందులో లైంగికార్థాన్ని చూశారు. దాని అర్థం ఎంత దొరకనిదీ, చిక్కనిదీ అయినా, దాని భయానక మార్మికతల గురించి, మనలను మార్మికతలోకి గొనిపోయే దాని అందం గురించి ఏమాత్రం సందేహం అక్కరలేదు. జాన్‌క్రాక్ట్ అనే రచయిత దానిని 'చిత్రిత పద్యం' (Painted Poetry) అన్నాడు

# మిసిమి

"All that we are is the product of what we have thought"
is "We are what we think." - Dammapada.

సంపుటి 11 | జూన్ 1999 | సంచిక 6

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : 'నిద్రిస్తున్న జిప్సీ'

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536
e-mail : misimi_m@hotmail.com
http : //www.misimi.com

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

# Abraham Lincoln's Letter To His Son's Teacher

He will have to learn, I know,
that all men are not just,
all men are not true.
But teach him also that
for every scoundrel there is a hero,
that for every selfish politician,
there is a dedicated leader...

Teach him that for every enemy
there is a friend.
It will take time, I know:
but teach him, if you can,
that a dollar earned is
of far more value tha five found...
teach him to lose...
and also to enjoy winning.

Steer him away from envy, if you can,
teach him the secret of quiet laughter.
teach him, if you can,
the wonder of books ...
But also give him quiet time
to ponder the eternal mystery
of birds in the sky,
bees in the sun,
and flowers on a green hillside.

In school teach him
it is far more honourable to fail
than to cheat...
Teach him to have faith in his own ideas,
even if everyone tells him they are wrong...
Teach him to be gentle with gentle people,
and tough with the tough.

Try to give my son
the strength not to follow the crowd
when everyone is getting on the band wagon.
Teach him to listen to all men...
but teach him also to filter all he hears
on a screen of truth,
and take only the good that comes through,
teach him, if you can,
how to laugh when he is sad...
Teach him there is no shame in tears.

Teach him to scoff at cynics
and to beware of too much sweetness..
Teach him to sell his brawn
and brain to the highest bidders,
but never to put a price tag
on his heart and soul.

*(Continued from : 164)*

# బోరిస్ లియోనిడొవిచ్ పాస్టర్‌నాక్

## (1958 నోబెల్ పురస్కార తిరస్కార ప్రకటన)

మూలం: ఏండర్స్ ఆస్టర్లింగ్ అనువాదం : – బి.వి. రామిరెడ్డి
(కార్యదర్శి, సీడిష్ అకాడమి)

ఈ సంవత్సపు (1958) నోబెల్‌సాహిత్య పురస్కారాన్ని సోవియట్ రష్యాకు చెందిన బోరిస్ పాస్టర్‌నాక్‌కు సమకాలీన కవితా సృజనలోను, రష్యన్ కథా కథనంలోను అతడు సాధించిన సాహితీ సృజనకు గాను ప్రదానం చెయ్యాలని స్వీడిష్ అకాడమి నిర్ణయించింది.

అయితే తాను ఈ అత్యున్నత పురస్కారాన్ని తిరస్కరిస్తున్నట్లు పాస్టర్‌నాక్ కబురు పంపాడు. ఈ తిరస్కృతి ఈ పురస్కారపు గొప్పదనాన్ని ఏమాత్రమూ తగ్గించలేదు అందువల్ల ఈ పురస్కార ప్రదానం జరగదని ప్రకటించడానికి స్వీడిష్ అకాడమి విచారిస్తున్నది

1958 అక్టోబరు 25న రష్యన్ రచయిత బోరిస్ పాస్టర్‌నాక్‌కు ఈ సంవత్సరపు నోబెల్‌సాహిత్య బహుమతిని ఇవ్వడానికి నిర్ణయించినట్లు స్వీడిష్ అకాడమి నుండి అధికారిక వార్త వెలువడింది. దానికి సమాధానంగా పాస్టర్‌నాక్ స్వీడిష్ అకాడమికి ఈ క్రింది టెలిగ్రాం పంపాడు.

''మరీ మరీ కృతజ్ఞతలు, కదిలిపోయాను...గర్వంగా, ఆశ్చర్యంగా, సిగ్గుగా...'' ఈ టెలిగ్రాం తరువాత అక్టోబరు 29న ఆయన మరొక టెలిగ్రాం పంపాడు:

''మీరు నేను నివసిస్తున్న నా సమాజానికి ఈ పురస్కారాన్ని ఎందుకివ్వదలిచారో నేనర్థం చేసుకున్నాను. అనర్హుడనైన నేను ఈ పురస్కారాన్ని తిరస్కరిస్తున్నాను. నా యీ తిరస్కారానికి బాధపడకండి ''

## జీవిత చరిత్ర

బోరిస్ లియోనిడొవిచ్ పాస్టర్‌నాక్ (1890-1960) మాస్కోలోని ఒక కళాకారునికి జన్మించాడు తండ్రి ఒక పెయింటర్, అతను టాల్‌స్టాయ్ రచనలకు బొమ్మలు వేయడంలో ప్రసిద్ధుడు. తల్లి గొప్ప పియానో విద్వాంసురాలు పాస్టర్‌నాక్ విద్యాభ్యాసం మాస్కోలోని ఒక జర్మన్ జిమ్నాసియంలో ప్రారంభమై మాస్కో విశ్వవిద్యాలయంలో కొనసాగింది. పాస్టర్‌నాక్ స్క్రియాబిన్ అనే సంగీత విద్వాంసుడి ప్రభావంతో 1904 నుండి 1910 దాకా, ఆరు సంవత్సరాలపాటు సంగీతా నభ్యసించే ప్రయత్నం చేశాడు 1912 కల్లా సంగీత విద్యకు వీడ్కోలు చెప్పి జర్మనీలోని మార్‌బరో విశ్వవిద్యాలయంలో చేరి తత్త్వశాస్త్రాన్ని పఠించడం ప్రారంభించాడు. నాలుగు నెలల తరువాత ఇటలీలో పర్యటించాడు రష్యాకు తిరిగివొచ్చి, తనజీవితాన్ని సాహిత్యానికి అంకితంచేసు కోవాలని నిర్ణయించుకున్నాడు.

పాస్టర్‌నాక్ మొదటి రచనకు ఎలాంటి గుర్తింపూ లభించలేదు 1922 లో రచించిన ''మై సిస్టర్ లైఫ్'', 1923లో ప్రచురించిన ''థీమ్స్ అండ్ వేరియేషన్స్'' తో సమకాలీన రష్యన్ కవులలో ఒకడిగా గుర్తింపు పొందాడు 1924లో రచించిన ''సబ్లైమ్ మలడీ'' 1905వ సంవత్సరపు తిరుగుబాటును గురించినరచన. ''ది చైల్డ్‌హుడ్ ఆఫ్ లువీర్స్'' ఒక బాలిక స్త్రీత్వంలోకి పరివర్తన చెందే మానసిక విశ్లేషణకు సంబంధించినగేయరచన. 1925లో '' ఏరియల్‌వేస్ '' అనే నాలుగు కథల సంకలనం వెలువడింది. 1927లో పాస్టర్‌నాక్ మళ్ళీ 1905 తిరుగుబాటు నేపద్యంతో రెండు దీర్ఘకావ్యాలు వ్రాశాడు. లెఫ్టినెంట్ స్మిట్ అనే సెవస్టపూల్ తిరుగుబాటు యోదుణ్ణి గురించీ, ''ది ఇయర్1905'' అనే1905 తిరుగుబాటును గురించిన కవితారచన చేశాడు. 1931 లో పాస్టర్ నాక్ ఆత్మకథ ''సేఫ్ కాండక్ట్'' వెలువడింది. ఆ తరువాతి సంవత్సరమే ''సెకండ్ బర్త్'' అనే గేయసంపుటిని రచించాడు. 1935లో పాస్టర్‌నాక్ కొందరు జార్జియన్ కవుల రచనల్ని అనువదించాడు. తరువాత షెక్స్పియర్ నాటకాలను, గెధె, స్కిల్లర్, క్లేస్ట్, బెన్‌జాన్సన్‌ల రచనల్ని అనువదించాడు. ఫిటోఫి, వెర్లైన్, స్విన్ బర్న్, షెల్లీ మొదలైనవారి కవితల్ని అనువదించాడు. ''ఇన్ ఎర్లీ ట్రెయిన్స్'' అనేకవితా సంకలనాన్ని 1943లో ప్రచురించి, 1945 లో ''వైడ్ స్పేసెస్ ఆఫ్ ఎర్త్'' అనే సంకలనంగా విస్తృతీకరించాడు. అతడు రచించిన ఒకే ఒక్క ప్రసిద్ధనవల ''డాక్టర్ ఝివాగో'' 1957 లో వెలువడింది. అతని ''స్పెక్టోస్కీ'' (1926) ఇటాలియన్ అనువాదం విమర్శకుల ప్రశంసలు పొందింది. 1959 లో ప్రచురింపబడ్డ ''ఏన్ ఎస్సే ఇన్ ఆటోబయాగ్రఫీ '' మొదట ఇటాలియన్‌లోను, తరువాత ఆంగ్లంలోను ప్రచురించబడింది 1960లో చనిపోయేవరకు పాస్టర్‌నాక్ మాస్కోకు సమీపంలో ఉన్న పెరిడెల్కినోలో నివసించాడు.

---

*(Continued from page no. · 162)*

**Teach him to close his ears to a howling mob**
**and to stand and fight**
**Treat him gently,**
**but do not cuddle him,**
**because only the test of fire makes fine steel.**
**Let him have the courage to be**
**impatient**
**let him have the patience to be brave.**

**Teach him always**
**to have sublime fiath in himself,**
**because then he will always have**
**sublime faith in humankind.**

**This is a big order,**
**but see what you can do ...**
**He is such a fine little fellow,**
**myson.**

# సైన్సూ, మన ఆధ్యాత్మిక జీవన కాలుష్యం

ఆంగ్లమూలం : డా॥ రాజారామన్న        అనువాదం : నాగసూరి వేణుగోపాల్

మేధావులనబడే చాలామంది భారతీయులు విజ్ఞాన శాస్త్రనియమాలను విభేదించే ఆత్మలనూ, అతీతశక్తులను నమ్మడం ఎందుకు? - అని చాల మంది నా విదేశీ పర్యటనలలో అడుగుతూ వుంటారు. చాలా మంది భారతీయులు, తమది ఆధ్యాత్మిక దేశమని గర్వపడుతూ వుంటారు. హేతుబద్ధమైన సైన్సు సూత్రాలకు నిలువని అతీతశక్తి యొక్క గొప్పదనాన్ని మేధావులనబడే వాళ్ళు అంగీకరించడంతో వారు ఆనందపడుతూ వుంటారు. ఇటువంటి ప్రవర్తనకు కారణాల గురించి చర్చించే ముందు మేధావులుగా పిలువబడే వాళ్ళు, ఆత్మ, విజ్ఞాన శాస్త్రపు పునాదులను నిర్వచించు కోవాల్సివుంది.

భారతదేశంలో మేధావి అనే పదానికి చాలా తాత్పర్యాలున్నాయి. అందువల్ల మేధావిని పలు రకాలుగా నిర్వచించవచ్చు. స్వాతంత్ర్యానికి పూర్వం మెకాలే స్ఫూర్తిగల బ్రిటీషు విధానంలో విద్య పొందిన వారు. అంటే పాశ్చాత్య సాహిత్యంతో పరిచయం వుండి, చదవను, రాయను సామర్థ్యం గల్గి - తను చదివే అంశాలను తన జ్ఞానేంద్రియాలతో పరీక్షించకుండా అంగీకరించేవారు. అలాగే సాంప్రదాయ సంస్కృతి లేదా ఇస్లామిక్ సంస్కృతులలో శిక్షణ పొంది, గొప్పదనం మలినపడుతుందనే భయంతో సంప్రదాయం పేరుతో యింద్రియాలకు సెలవు యిచ్చేవారు కూడా మేధావిగా పరిగణించ బడుతున్నారు. ఇందులో కూడా చాలా వివాదస్పదమైన మేధావులు వున్నారు. విజ్ఞాన శాస్త్రంలో విద్యపొంది, పరిశీలించబడి స్వీకరించిన సమాచారం ఆధారంగా ప్రతిపాదనలను పరీక్షించేందుకు ప్రత్యేక శిక్షణ పొందినవారు తమ శిక్షణను, విజ్ఞాన శాస్త్ర నియమాలను తిరస్కరించి ఆధ్యాత్మిక శాంతికోసం పరితపించే సమాజంలో భాగం కావడం వీరి ప్రత్యేకత. ఇలా తొలిచూపులోనే ''గురువు'' ద్వారా శాంతిని పొంది 1 = 2 అన్న అర్థం లేని సూత్రీకరణలను సైతం అంగీకరిస్తారు. అయితే మరో రకం శాస్త్రవేత్తలు మరికొందరు వున్నారు. ఆధ్యాత్మిక కారణాలకు ''నిజాయితీ'' గా గురయినా పాదార్థిక ప్రపంచంతో వాటికి ముడి పెట్టరు. ఇలా ఏ కారణంతో, ఈ అతీతశక్తి రూపొందించబడినా అసలు కారణం ఒకటే!

పూర్తి భౌతిక దృష్టితో పరిశీలించి జీవకణవ్యవస్థ సమీకృతంగా ఒక జీవిగా ఏర్పడిన పిదప దాని ప్రవృత్తిని కేవలం భౌతిక రాశుల ద్వారా ప్రస్తుతం వివరించలేమని ఎవరయినా అంగీకరిస్తారు. అలా ఏర్పడ్డ వ్యవస్థ చైతన్యాన్ని రూపొందించి, అది ఆధ్యాత్మికంగా ప్రవర్తింప చేస్తుందా లేదా అటువంటి చైతన్యం ప్రత్యేకంగా వుంటుందా అన్నది పెద్ద ప్రశ్న? అయితే దీన్నెలా అర్థం చేసుకున్నా, యిటువంటి మన అంతర్గత చైతన్యం అనే దానివల్ల పాదార్థిక ప్రపంచంలో ఎటువంటి శాస్త్రీయ అసంగతాలను రూపొందించడం లేదు. ప్రయోగశాలల్లో జీవ పదార్థంతో జరిపిన అన్ని ప్రయోగాలలో శక్తినిత్యత్వ, ఎంట్రోపి నిత్యత్వ నియమాలు తిరస్కరించబడిన దాఖలాలు లేవు. పోనీ పదార్థంలో ఈ అతీత శక్తి వుందనుకుంటే, పాదార్థిక ప్రయోగాలలో యిది ఏ ప్రాపంచిక సూత్రాన్నీ విస్మరించిన సందర్భంలేదు.

అయితే మన శక్తులన్నింటిని కూడ దీసుకుని ఈ పాదార్థిక ప్రపంచంలో ఎక్కువ ఫలితం పొందడానికి దీన్నివాడుకోవచ్చు కానీ ప్రధాన సమస్య ఏమంటే ఎందుకు ప్రకృతి ఈ పధంలో నడిచిందని మనం వివరించ లేకపోవడం చాలా మంది గొప్ప శాస్త్రవేత్తల ప్రకారం ప్రాణుల పుట్టుక అనేది ఏదో కాకతాళీయ సంఘటన, తర్వాత పరిణామం సంభవించింది.

విజ్ఞాన శాస్త్రానికి కూడా పరిధులున్నాయి. వాటి గురించి చక్కగా వివరించాడు ఎ. ఎన్. వైట్ హెడ్. అతను యిలా రాశాడు

''ప్రకృతిలో ఏ ఒక్క జీవి ఆనందాన్ని సైన్స్ కనుక్కోదు ప్రకృతిలో ఏ లక్ష్యాన్ని సైన్స్ కనుక్కోదు. ప్రకృతిలో ఏ సృజనాత్మకతను సైన్స్ కనుక్కోదు అయితే అది కేవలం పరంపరకు చెందిన సూత్రాన్ని వివరిస్తుంది.''

విజ్ఞాన శాస్త్రానికున్న ఈ పరిధులవల్ల మన సృజనాత్మక ప్రక్రియలన్నింటికీ ఈ అతీత శక్తో, చైతన్యమో అని మనం ఆపాదిస్తాం. అయితే ఈ పరిణామపథం, గుర్తించబడ్డ చైతన్యం వల్ల మన సామాజిక జీవనానికి నైతిక సూత్రాలు, నియమాలు అవసరం అవుతాయి. ఏ వ్యవస్థీకృతమైన మతానికయిన ప్రధాన కారణం యిదే. చాలాకాలం క్రితమే గౌతమ బుద్ధుడు దీని గురించి స్పష్టంగా ఆవిష్కరించాడు.

ఇప్పుడు ''విజ్ఞాన శాస్త్ర పునాదులు'' గురించి, వాటి శాశ్వతత్వం గురించి పరిశీలిద్దాం. ఏ రెండు విభిన్న సంఖ్యలు సమానం కాదన్న గణిత శాస్త్ర మౌలిక ప్రతిపాదనను విభేదించే ఏ సూత్రీకరణ అయినా నిలబడదని మన యింగితం చెప్పగలదు. ఒకవేళ 1 = 2 అని అనుకుంటే మొత్తం గణితశాస్త్రం, వ్యాపార వ్యవహారాలు వంటి వెన్నో ఆగిపోతాయి, అర్థరహితమవుతాయి. ఇది మానవ అనుభవం, మనం సేకరించిన జ్ఞానం ఈ నియమాన్ని బలపరుస్తాయి. అద్భుతాలు, పెద్ద పెద్ద వస్తువులు గాలి నుంచి సృష్టించబడటం అన్నవి మౌలిక సూత్రాన్ని విభేదిస్తున్నాయి అన్నది చూద్దాం, దీనికోసం భౌతిక శాస్త్ర నియమాలలో శక్తి నిత్యత్వ నియమాన్ని తీసుకుందాం. విజ్ఞాన శాస్త్రానికి పునాది రాయి వంటి ఈ శాస్త్ర నియమాన్ని విజ్ఞాన శాస్త్రపు పుట్టుక నుంచి పరీక్షించారు. మొదట్లో దీన్ని ద్రవ్య నిత్యత్వ నియమంగా పిలిచినా, ఐన్‌స్టీన్ ద్రవ్యరాశి. శక్తి సమానాలను ఋజువు చేశాకా ఈ ద్రవ్య నిత్యత్వ నియమం మరింత విస్తృత మయింది. ఈ నియమం శూన్యం నుంచి ఏ పదార్థాన్ని కానీ, శక్తిని కానీ సృష్టించలేమని విస్పష్టంగా చెబుతుంది.

ఒకవేళ అలా సృష్టించగలిగితే 1 = 2 అని కూడా ప్రతిపాదించవచ్చు. ఒకవేళ అన్ని భౌతిక శాస్త్ర నియమాలను తిరస్కరించినా, దీన్ని మాత్రం విసర్జించలేం. ఎందుకంటే యిది లేకుండా ఏ అంతరిక్ష పరిశోధనగానీ,· ఏ అణు సంబంధమైన పరికరం గానీ, అలా అనుకుంటే ఏ సాంకేతిక క్రియను ముందుకు సాగించలేం.

శక్తి నిత్యత్వ నియమం అనేది జీవ, నిర్జీవ పదార్థాలకు కూడా వర్తిస్తుంది. ఈ రెండు రకాల పదార్థాలు కూడా పరమాణువుల అణువుల సముదాయమని మనకు తెలుసు. పాదార్థిక దృష్టితో చూసినపుడు

అసలు అర్థం లేని ఆధ్యాత్మిక శక్తి ద్వారా బూడిద, గడియారాలు సృష్టించబడుతున్నాయన్నది ఏ శాస్త్రవేత్తకయినా ఆశ్చర్యం కల్గిస్తుంది హిందు మతాచారాలలో ఈ భస్మాలకు ఎందుకంత ప్రాధాన్యత కల్గివుందో నాకెపుడు అర్థం కాలేదు పురాణాల నుంచి వచ్చిన గాధలలో దాని ప్రాధాన్యత వున్నా, ఒక రసాయన శాస్త్రవేత్తకు మాత్రం అది ఆక్సీకరణం చెందిన పదార్థం! అందులో నుంచి శక్తి తీయబడి వుంటుంది. మంచి గడియారాలు లభ్యంకాని రోజుల్లో ఉచితంగా గడియారాలు కొరకు ఆశపడటంలో అర్థం వుండవచ్చు. ఇది ఎటువంటిదంటే సగటు మనిషి కట్నంగా ఉచితంగా గడియారం పొందడం లాంటిది అయితే అలా ఆధ్యాత్మికంగా సృష్టించబడ్డ వస్తువులు హేతుబద్ధతను సర్వనాశనం చేస్తాయి. కానీ దీనికి కనిపించే ప్రత్యామ్నాయ వివరణ ఏమంటే మంచి గారడి లేదా మేజిక్ డా॥ కోవూర్ యిటువంటివి చాలా చేయగలడు దానికి ఏ దివ్యశక్తులూ అవసరం లేదు. అందువల్ల ప్రతిక్షణం సైన్స్ ఫలాలు పొందుతూ సైన్సును విసర్జించడం కన్నా డా॥ కోవూరు చేసే మేజిక్ వంటి గారడి నమ్మడం ఉత్తమం.

మరి కొంత మంది వున్నారు వారు తమ దృష్టికి వచ్చిన ప్రతి దానిని హేతుబద్ధం చేయబోతారు దానికి సాపేక్షతా సిద్ధాంతంతో ఎన్నో వైరుధ్యాలను చతుర్మితీయ ప్రదేశ భావనతో భౌతిక శాస్త్రంలో చేరినట్టు యిటువంటి అద్భుతాలు వివరించబడాలంటే యింకా ఎక్కువ పరిమాణంలో రూపరహిత ప్రదేశం అవసరం మంటారు. అయితే దీని గురించి మనం ఒకటే వ్యాఖ్యానించ వచ్చు - సాపేక్షతా సిద్ధాంతం సైన్సును బలోపేతం చేయగా, అద్భుతాలను వివరించడానికి రూపరహిత ప్రదేశీ భావనను ప్రవేశ పెట్టడం అన్నది సైన్సు పునాదులను కబళిస్తుంది.

మనో సంబంధమైన వ్యాధులను నయం చేయడానికి ఆధ్యాత్మిక మార్గాలు వాడటం అన్నది నాకు చాలా జాలి కల్గిస్తుంది. లెక్కకు మించిన రీతిలో మనోసంబంధ వ్యాధులు వ్యాపించడం, ఈ మానసిక వ్యాధులను వివరించే, నివారించే రీతిలో వైద్య శాస్త్రం అభివృద్ధి చెందకపోవడం గమనించాలి ఇటువంటి రోగాలు సవ్యంగా నయం అయినపుడు దానికి ఆ-డాక్టరు సామర్థ్యం అంటారు కానీ ఆధ్యాత్మిక వాదాలు గుర్తుకురావు. ఇది నేను డాక్టర్ల నుంచి సేకరించిన సమాచారం. చాలా సందర్భాలలో ఆధ్యాత్మికంగా నయం చేయడం అన్నది - అర్థం లేని ఆశలు కల్పించి, మేలు కన్నా కీడే ఎక్కువ చేస్తుంది. ఇందులో విషాదం ఏమంటే చాలా మంది వీటిని పరిక్షించకుండా, అవి తామే స్వయంగా చూసినట్టు చెబుతారు. కానీ వాస్తవంగా వీలుగాదు. కొన్ని సందర్భాలలో కొన్ని మానసిక కారణాలలో మనో సంబంధ వ్యాధులు నయం అయినా ఆ కోలుకున్న రోగి అదృష్టవంతుడు అంటాను. అయితే యిలా జరిగే మేలు సమాజానికి జరిగే కీడుతో పోలిస్తే చాలా స్వల్పం. ఇటువంటి సమాచారం సేకరించి బెంగుళూరు విశ్వవిద్యాలయంలో పరీక్షించడం జరిగింది ఇటువంటి పని ప్రతి విశ్వవిద్యాలయం కూడా చేసి యువత ఆధ్యాత్మిక కాలుష్యానికి, మోసానికి గురికాకుండా చూడాలి.

నిత్య జీవితంలో మన ప్రవర్తన విషయంలో ఆధ్యాత్మిక ఆలంబన అవసరం కాదని ఎవరూ అనరు అలాగే ఆధ్యాత్మిక ప్రేరణ వల్ల కళా, సౌందర్య కృతులు సృజించబడటాన్ని కూడా ఎవరూ కాదనలేరు. తీవ్రమయిన ఒత్తిడికి లోనయిన సందర్భాలలో మనిషి దేవుడి ముందు కొబ్బరికాయ కొట్టడాన్ని కూడా నేను నివారించను. అయితే నేను అసహజ మయిన రూపాన్ని కోరుకుంటాను - వేదాలు అపురూపమయిన, సూక్ష్మమయినదాన్ని పూజించాలని అంటాయి కానీ, స్వంతలాభం కోసమో, కోరికలు తీరడం కోసమో కాదు. మనల్ని గురించి మనం ప్రశ్నించుకునే ప్రత్యేక చైతన్యం మనకు మాత్రమే వున్నప్పుడు - భయాందోళనలు కలిగిన సమయాల్లో ఆలోచించగల వ్యక్తుల చెంతన వుండటానికెందుకు ప్రయత్నించకూడదు? భయం నుంచి బయట పడటానికి వేదాలలో చాలా వుంది, అలాగే తాత్వికానందం కొరకు ఎంతో వుంది - పురాణాలలో మన నైతిక ప్రవర్తనకు మార్గదర్శకంగా ఎన్నో దృష్టాంతాలు వున్నాయి.

అయితే దురదృష్టవశాత్తు పురాణం అంటే మామూలు స్థాయిలో తీసుకుంటున్నామే గానీ, అంతకు మించి గాదు. ఈ కారణం చేతనే మన సంప్రదాయ జ్ఞానం మీద, అద్భుతాల మీద యింత గంధరగోళం ఏర్పడింది.

మన ఆధ్యాత్మిక నాయకులు గారడిలు చేసి ప్రజలను ఆకట్టుకోవడానికి ప్రయత్నాలు చేయకుండా వేదాలలోని గొప్ప సత్యాలను, తత్వవేత్తల గొప్ప సృజనలను వివరించడానికి పాటుపడితే మానవాళికి ఎంతో మేలు జరిగేది. అలాగే బలహీనులను, చిన్న వాళ్లను ఈసడించుకునే వారికి ఆధ్యాత్మిక సహకారం అందించడానికి తమ శక్తియుక్తులు ఈ ఆధ్యాత్మిక నాయకులు వాడుకోవచ్చు. మన సమాజంలో జరిగే దురన్యాయాలకు అదుపులేదు మురికివాడలలో మధ్య తరగతి కుటుంబాలలో జరిగే దురన్యాయాలకు అదుపులేదు. మురికివాడలలో మధ్య తరగతి కుటుంబాలలో జరిగే క్రూరత్వాన్ని మనం నమ్మలేం. వాస్తవానికి తాము జీవించే పరిస్థితి నుంచి కాస్త తప్పించు కోవడానికి స్వర్గం, నరకం అనే భావనలు ఏర్పడ్డాయి. ఆధ్యాత్మిక మార్గనిర్దేశకత్వం సాయంతో మానవాళికి కలిగే యిడుములు నివారించవచ్చుగదా? ఎక్కడయితే వారి అవసరం చాలా వుందో అక్కడ తమ శక్తి యుక్తులు ఈ ఆధ్యాత్మిక నాయకులు వినియోగించవచ్చు గదా? కేవలం ఈ గారడి ప్రజలన్నం లోబరుచుకోవడానికేనా? మనది గొప్పదేశం, ఆధ్యాత్మిక బలంలోని నిగూఢత ఎంతో వుంది కానీ అద్భుతాలనూ, ఉంగరాలు సృష్టించబడుటను నమ్మేంత మూఢ నమ్మకాలతో మురిగిపోయే అనాగరిక మానవులుగా మనల్ని మనం ప్రపంచానికి చాటుకోవడం ఎందుకు?

(Raja Ramanna రాసిన "Science and Pollution of our Spiritual lives" అనే ఈ వ్యాసం బెంగుళూరు విశ్వ విద్యాలయం ప్రచురించిన Science, Society and Scientific Attitude పుస్తకంలోనిది.)

# శ్రీశ్రీ భావ చిత్రాలు

– డా॥ తక్కోలు మాచిరెడ్డి

ఆధునిక కవితకు ప్రాణం భావచిత్రాలు. శ్రీశ్రీ కవితలో (మహా ప్రస్థానం సంపుటి) వస్తువు ముఖ్యమా, రూపం ముఖ్యమా అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టం. ఈరెంటి మధ్యా శ్రీశ్రీ ప్రదర్శించిన సమతౌల్యం అతని భావ చిత్ర విధాన ఫలితంగా ఆలోచన, అనుభూతి, కళాత్మకతల సమన్వయం వల్ల శ్రీశ్రీ కవితలో ఉత్కృష్టభావ చిత్ర విధానం రూపు దాల్చింది. సందర్భానుసారంగా యిందులో కొన్ని చోట్ల ప్రవాహం, శిల్పకారిత, అనుభూతి ప్రవణత గోచరమౌతాయి అందుకే మలచినట్లు కన్పించినా భావచిత్రాలు కళాత్మకం కాగలిగాయి.

శ్రీశ్రీ అభ్యుదయ కవిగా ప్రసిద్ధుడు. కాని ఆయన వాస్తవంగా అభ్యుదయ కరమనిపించే పలు ప్రగతిశీల ధోరణులకు ప్రాతినిధ్యం వహిస్తాడు. పాశ్చాత్య అధి వాస్తవికతా వాదం, డాడాయిజంల ప్రభావం కూడా అతని కవితలో చూడవచ్చు. ఆయన కవిత ప్రగతి శీలమూ ప్రయోగ శీలమూ కూడా. వీటి రెంటి ద్వంద్వాత్మక ఘర్షణతో శ్రీశ్రీ కవిత మరింత కళాత్మకం కాగలిగింది. శ్రీశ్రీ కవితల్లో వాస్తవికతా వాదం కంటె విప్లవ భావుకత, ప్రయోగ శీలత వ్యాపించి వున్న కవితలే యెక్కువ అంటే సరిపోతుందేమో ''అంధేరేమేఁ'' లాంటి కవితరాసిన ముక్తిబోధ్ యొక్క విప్లవ భావన, 'అజ్ఞేయ్' కళా సౌందర్యం ఈ రెండు గుణాలూ మనం శ్రీశ్రీ కవితలో చూడవచ్చు.

సంప్రదాయంగా వస్తున్న భావచిత్రాల్నే సంస్కరించి, సింగారించి, సముచిత రీతిలో ఆధునికత చొప్పించి ప్రయోగిస్తాడు శ్రీశ్రీ. ఇది ఈ కవి ప్రత్యేకత. మనం అదే పనిగా పరిశీలిస్తే తప్ప, అతని భావ చిత్రాలు సంప్రదాయ భావచిత్రాలు అన్పించవు. ఒక విధంగా అవి శ్రీశ్రీ కవితల్లో పునర్జన్మ పొందాయేమో అన్పిస్తుంది. శ్రీశ్రీ సంప్రదాయ భావ చిత్రాల ప్రత్యేకత ఏమిటంటే వాటిని భారతీయ పురాణగాథలనుండి తీసుకోవటం - ఉదా:

యముని మహిషపు లోహ ఘంటలు
మబ్బు చాటున
ఖణేల్మన్నాయ్!
నరకలోకపు జాగిలమ్ములు
గొలుసు త్రెంచుకు ఉరికి పడ్డాయి.
ఉదయ సూర్యుని సప్తహయములు
నురుగులెత్తే పరుగు పెట్టేయి...

మరికొన్ని సంప్రదాయ భావ చిత్రాలు -

రుద్రాలిక నయన జ్వాలిక
కలకత్తా కాళిక నాలిక
కావాలోయ్ నవ కవనానికి

★ ★ ★

కనబడ లేదా మరో ప్రపంచపు
కణకణమండే త్రేతాగ్ని....

అంతే కాకుండ, మౌలికమైన అందమైన భావ చిత్రాలు కొన్ని కవితల్లో ప్రముఖంగా ప్రభావశీలంగా అనుభూతి వ్యంజకంగా కన్పిస్తాయి. ఉదా.

ఆకాశపు టెడారి
లో కాళ్ళు తెగిన
ఒంటరి ఒంటె లా
గుంది జాబిల్లి!

తన నవ్య సౌందర్య శాస్త్రం ప్రకారం జాబిల్లిని ప్రబంధశైలికి బహుదూరంగా ఆకసపు ఎడారిలో కాళ్ళు తెగిన ఒంటరి ఒంటె లాగుందంటూ మాననీయంగా మూర్తిమంతం చేశాడు శ్రీశ్రీ.

పరిసరాల్ని చిత్రిస్తూ అలంకారాలతో కాకుండ, పూర్తిగా భావ చిత్రాలతోనే ధ్వనిస్తాడు కొల్లగొట్టుతనాన్ని - అద్భుతంగా నిరాడంబరంగా సామాన్యుని భాషలో 'భిక్షు వర్షీయసి' కవితలో వస్తువులోనే భాగమైన భావబింబాల్ని ఇలామలిచాడు - శ్రీశ్రీ

ఎముక ముక్క కొరుక్కుంటూ
ఏమీ అనలేదు కుక్క
ఒక ఈగను పడ వేసుకు
తొందరగ తొలగె తొండ ...
క్రమ్మె చిమ్మచీకట్లు
దుమ్మురేగె నంతలోన
''ఇది నా పాపం కాద'' ని
ఎగిరి వచ్చి ఎంగిలాకు

ఇందులో ఒక డిజైను వుంది. కొల్లగొట్టు తనపు పాశవికతను ఈ పశుబింబాల ద్వారా కళాత్మకంగా చిత్రించ గలిగాడు శ్రీశ్రీ. కుక్క, తొండ చీకటి స్థితిని బోధిస్తాయి. ఎంగిలాకు కొల్లగొట్టు తనానికి బోధకం.

శ్రీశ్రీ మహాప్రస్థానపు అర్ణవంలో హోరెత్తించే కవితల్లో ఒకటి 'కవితా! ఓ కవితా!' ఇది విచిత్ర భావ చిత్ర మయం. ఇందులో కవితను గురించిన ఓ విజన్ వుంది - ఓ సందృష్టి వుంది - కవితను ప్రభవింప చేసే భావ చిత్ర విధానం వుంది. కథనంలోనే భావ చిత్రాలు కన్పిస్తాయి. కవితను స్మరిస్తే శ్రీ శ్రీ కి కన్పించే దృశ్యాలు, విన్పించే నాదాలు ఇవీ -

మరి నిన్ను స్మరిస్తే
నాకగుపించే దృశ్యాలా?
వినిపించే భాష్యాలా?
అగ్ని సరస్సున వికసించిన వజ్రం
ఎగిరే లోహ శ్యేనం -

ఈ దృశ్య చిత్రాలే కాక, కవికి విన్పించే శ్రవ్య బింబాలు ఉదాహరణీయాలు -

ఇంకా నేనేం విన్నానా
నడిరే నిద్దురలో
అపుడే ప్రసవించిన శిశువు నెడద నిడుకొని
రుచిర స్వప్నాలను కాంచే
జవరాలి మనః ప్రపంచపుటావర్తాలు!
శిశువు చిత్ర నిద్రలో
ప్రాచీన స్మృతులూచే చప్పుడు!

ఒక చిన్న భావచిత్రం ద్వారా తీవ్రంగా ఆలోచింపచేసే గుణం వుంది శ్రీశ్రీ కవితలో ''తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీ లెవ్వరు?'' అని ప్రశ్నించడంతో సామ్యవాద సిద్ధాంతంలో 'సమస్త సంపదకూ కారకులు శ్రామికులే' అనేసూత్రాన్ని నొక్కి చెప్పినట్లయింది.

పౌరాణిక భావ చిత్రాలు ప్రత్యేక అర్థాన్ని స్ఫురించేట్లు ప్రయోగిస్తాడు శ్రీ శ్రీ. ప్రతీకలు గానే కాకుండ, బింబరూపంలో ఈ ప్రయోగం చాలా చోట్ల చూడొచ్చు. జగన్నాథ రథ చక్రాలు విముక్తి దాయకం అనే నూతన సామాజిక అర్థంలో ప్రయోగిస్తాడు శ్రీశ్రీ. రథ చక్ర ప్రళయ ఘోషను భూ మార్గం పట్టిస్తాను, భూకంపం పుట్టిస్తాను అంటాడు ఇక్కడ జగన్నాథ రథ చక్రాలు ప్రతీకార్థంలోనే కాక, ఒక దృశ్య చిత్రంగా ప్రయోగించుడు. ఈ కవిత పతితులనూ, భ్రష్టులనూ, బాధా సర్పదష్టులనూ, దగా పడిన తమ్ములనూ సంబోధిస్తూరాశాడు అధోజగత్సహోదరులు వీళ్ళు ఒక కవిగా, ప్రగాఢ అనుభూతి సామర్థ్యం వున్న కవిగా సమాజంలోని 'పతిత' 'నిర్గతిక' శ్రేణు లన్నింటినీ పలకరిస్తాడు శ్రీశ్రీ. ఇది సహజంగా జరిగింది.

పల్లె విడిచి బతుకు తెరువు కోసం పట్నం పోతూ వున్న బాటసారి వ్యథ 'బాటసారి' అనే కవిత. అతని బతుకున కదే ఆఖరు అంటూ కవి సార్థక భావ చిత్ర మాలిక నొకటి చిత్రిస్తాడు -

అతని బతుకున కదే ఆఖరు
గ్రుడ్డి చీకటిలోను గూబలు
ఘూకరించాయి;
వాన వెలసీ మబ్బులో ఒక
మెరుపు మెరిసింది;
వేగుజామును తెలియ జేస్తూ
కోడి కూసింది;
విడిన మబ్బుల నడుమ నుండీ
వేగు జుక్కా వెక్కిరించింది;
బాటసారి కళేబరంతో
శీత వాయువు ఆడుకుంటోంది

ప్రకృతి చిత్రాలను భావ చిత్రాలుగ మలచడం ఇందులోని ప్రత్యేకత. కవితకు శాశ్వతత్వం తెచ్చి పెట్టేది ఇటువంటి చిత్రీకరణే. 'ప్రతిజ్ఞ' కవితలో -

కమ్మరి కొలిమీ కుమ్మరి చక్రం
జాలరి పగ్గం
సాలెల మగ్గం
శరీర కష్టం స్ఫురింప జేసే
గొడ్డలి రంపం కొడవలి నాగలి
సహస్రవృత్తుల సమస్త చిహ్నాలు -

★ ★ ★

నా వినిపించే నవీన గీతికి
భావం !
భాగ్యం !
ప్రాణం !
ప్రణవం !

శ్రమ సాధనాలను భావాలుగ సంభావించడం చక్కగా అమరింది. సరళ బింబరచన సజావుగా సాగింది. గేయం రక్తి కట్టింది శ్రమ జీవుల పట్ల కవికుండే అభ్యుదయ దృక్పథం చక్కగా వ్యక్తమయింది

ఈ యెగిరిన ఇనుప డేగ
చ్పూర్ణమాన
ఘూర్ణమాన
దీర్ణమాన గిరిశిఖరాల్ -

ఇటువంటి విశేషణాలు బింబాత్మకంగా ప్రయోగించినాడు శ్రీశ్రీ.

'పేదలు' అనే కవితలో పేదల గుండెలు, కన్నులు, చేతులు బింబీకరిస్తూ -

అంతేలే పేదల గుండెలు
అశ్రువులే నిండిన కుండలు!
శ్మశానమున శశికాంతులలో
చలి బారిన వెలి రాబండలు

★ ★ ★

అంతేలే పేదల కన్నులు
వినమ్రములు, వెతల వ్రణమ్ములు
తుపానులో తడిసిన జడిసిన
గోమాతల కన్నుల తమ్ములు,

★ ★ ★

అంతేలే పేదల చేతులు
శ్లథశైశిర పలాశరీతులు
విశుష్కములు పరిపాండురములు
విచలించెడు విషాదహేతులు

ఇలా శ్రీ శ్రీ భావచిత్రాలు అనుభూతి స్ఫోరకము, కళాత్మకమూ అందుకు అనుగుణంగా భాషలో భావంలో శ్రీ శ్రీ ది ఝరీ ప్రవాహశైలి.

# సామ్యవాద కళాత్మక పార్శ్వం

- మాదిరాజు రంగారావు

మార్క్స్ ప్రతిపాదించిన సామ్యవాద సిద్ధాంతం ఆధారంగా సామాజిక లక్ష్యాన్ని కోరుతూ, రాజకీయాల ప్రత్యక్ష ప్రభావాల కతీతంగా, సాహిత్యంలో కళాత్మకమైన విలువలకు ప్రాధాన్యాన్ని కలిగిందీ సామ్యవాద కళాత్మక పార్శ్యం ఈ పార్శ్వాని కధినేత గుంటూరు శేషేంద్ర శర్మ మార్క్సిజాన్ని ఈ దేశ సంస్కృతికీ సామాజిక పరిస్థితులకూ అనుగుణంగా మలచబడి అవతరించిందీ, స్వేచ్ఛా కవిత్వంలో వెలువడిన శేషేంద్ర శర్మ కృతులీ మార్గాన్ని ఆవిష్కరిస్తాయి ఈ మార్గంలో ఇంకా వనమాలి మొదలైన కవులూ పయనించారు. ఇది కళాత్మకమైన అనుభూతికి ప్రాధాన్యం ఇస్తుంది. రాజకీయ పక్షాలకు దూరంగా ఉంటుంది. అంటే వీటిని గురించి అవగాహన కలిగి ఉంటుంది కాని, ప్రత్యక్ష ప్రమేయాన్ని మాత్రం కలిగి ఉండదు. అంతర్జాతీయ తలంపై సిద్ధాంతమైనా దేశీయ భావనతో పాటు నిఖిల మానవాళి శ్రేయస్సుపై దృష్టి కలిగి ఉంటుంది. సాహిత్యానికి వస్తే ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాల్లోని కావ్యశాస్త్రాంశాల్ని పరిగణలోకి తీసుకుంటుంది. తన ఆలోచన కనుగుణంగా సమన్వయ భావంతో వ్యాఖ్యానిస్తుంది. ఈ భూమికపై మార్క్సీయ సామాజిక భావనతో కళాత్మకమైన అనుభూతి ప్రాధాన్యంతో అవతరించిందీ పార్శ్వం. ఈ అభిప్రాయాలకు సిద్ధాంత వివరణ రూపం మేనిఫెస్టో (1974) ప్రకటితమైంది. ఈ ఆలోచనా రూపానికి సంస్థాగతంగా ''కవిసేన''(1977) ఏర్పడింది. కవిసేనలో మార్క్సిజం అవగాహన పూర్తిగా భిన్నమైంది. కవిసేన దృష్టికలో కవిత్వంలో రాజకీయాలు ఒక అంశం మాత్రమే. దీనికో పెద్ద పీట వేయకూడదని వీరి అభిమతం. కవిత్వంలో సౌందర్యాస్వాదనం ముఖ్యమైంది. దీని ఆకర్షణ రూపం అనుభూతి కళ మాత్రమే. దీన్ని రాజకీయ పక్షాలకు సంబంధించిన వాతావరణం కప్పేయ కూడదు. ఈ సౌందర్యా స్వాదనం - అనుభూతి కళ గురించి ప్రాచ్య పాశ్చాత్య కావ్య శాస్త్ర సిద్ధాంతాల సమాలోచనంతో మేనిఫెస్టోలోను, ఇతర సందర్భాల్లోను శేషేంద్ర శర్మ వివరించడం జరిగింది. అయితే మార్క్స్ ఆర్థిక దృక్పథాన్ని, సామ్యవాద సిద్ధాంతాన్ని సామాజిక రూపానికి ఆధార కేంద్రంగా గ్రహించడం ఇందులో విశేషం. ఈ పార్శ్వంలో సౌందర్యాస్వాదనం అనుభూతి కళ ఆకర్షణ రూపాలైనప్పటికీ, మార్క్స్ సామ్యవాద సామాజిక లక్ష్యంతో జోడింపబడి ఆవిష్కృతం కావడంవల్ల దీన్ని అనుభూతి పార్శ్వం నుండి వేరుగా సమాలోచనం జరపడం సముచితం.

శేషేంద్ర శర్మ ''సైద్ధాంతికంగా నేను మాత్రం విప్లవ కవిత్వం వైపే మొగ్గు చూపుతానంటాడు. మార్క్స్ విప్లవ సిద్ధాంతంపట్ల అభిలాష స్పష్టం. వస్తుగతమైన భౌతికాంశాలు అనుభూతి కళతో కవితాత్మను స్పృశించడం ఇష్టం. పీడితుల కోసం , బాధితులకోసం శోక తప్త హృదయంతో స్పందించడం కన్పిస్తుంది. ఇతనిలో పీడితుల పక్షం వహించే ఆలోచన వెంట సమాజంలో మనిషి ఎదుర్కొనే సమస్యలకు మార్క్సిజం పరిష్కార మార్గంగా స్వీకరించడం స్పష్టంగా కన్పిస్తుంది. ఇది కుల మత భాషా ప్రాంతాల్ని అధిగమించిన ఉదార భావనతో కూడింది. దీన్ని శేషేంద్ర శర్మ రాజకీయోద్యమంగా కాక 'వైజ్ఞానికోద్యమం'గా పేర్కొనడం జరిగింది. ఈ విశిష్టగుణం ఈ పార్శ్వానికి వెన్నెముక వంటిది.

వైజ్ఞానికోద్యమ భావన కవిసేన మేనిఫెస్టోలో ప్రతిపాదితమైంది. ఈ మేనిఫెస్టో ''వైజ్ఞానిక ఉద్యమ భూమికగా కవిసేన కార్యార్థం శేషేంద్ర శర్మ చేత'' రచితమైంది ఆధునిక యుగంలో విస్తరిల్లే స్వేచ్ఛాకవిత్వంలో ఒకపార్శ్వానికివైజ్ఞానికనాయకత్వాన్ని స్వీకరించడం జరిగింది ఈ కృతి ఈయన ''ఆశా కిరణమైన యువ తరానికంకితం'' చేయబడింది ఇందులో అనుభూతి కళ నుండి ఇంద్రియ వాదానికీ, ఇంద్రయ వాదం నుండి ఆత్మకళకూ పగాహించే సృజన రూపం సహేతుకంగా చర్చితమైంది మేనిఫెస్టోలో, ''సామాజిక చైతన్యమైనా, మరే చైతన్యమైనా అనుభూతి కళ అనే మూసలో పడి కళాత్మకతను పొందడం'' చాలా అవసరమన్న భావం స్పష్టంగా ప్రకటితమయింది. విషయమేమంటే, ఇది కవిత్వ స్వరూప ప్రయోజన తలంపై మార్క్సిస్టులతో భేదించే అంశంగా కన్పిస్తుంది. అయితే ఇది ఈయన దృక్పథంలో కొన్ని పరిమితుల్ని పొందింది. సామాజికార్థిక తలంపై మార్క్సిజంనూ, సాంస్కృతిక జీవన తలంపై మానవ నాగరతా పరిణామ దృష్టినీ, ఈ దేశానికి వస్తే స్థానిక జీవితాన్నీ, భారతీయ పరంపరనూ మన్నిస్తుంది. ఈ అవగాహనతో కవిత్వంలో అనుభూతి కళతో సృజనాత్మకమైన ఆకర్షణ శక్తిని కలిగింది. ఈ కారణంగా సరికొత్త పార్శ్వంగా సమాలోచన జరుపవలసిన అవసరాన్ని ప్రేరేపిస్తూంది. ''ఏ వస్తువైనా రాజకీయంగా గానీ సామాజికంగా గానీ మానవీకృతం కావాల''నే ఈయన అభిమతం. ఇది క్రమంగా కవితాకృతి పొందడం అవసరం ''మనిషి ఋణం తీర్చుకునే'' సంకల్పం, మానవశక్తినీ ప్రాధాన్యాన్ని ఆవిష్కరిస్తుంది.

మార్క్సిజాన్ని భారతదేశ స్థితి గతులకు మలచుకొనే శక్తినీ ప్రదర్శిస్తాడు. 'నేనెపుడు గొంతెత్తినా నా కోసం కాదు/, యాభైకోట్ల మంది కోసం గొంతెత్తుతాను/, నేను పడుతూన్న బాధలే నాదేశమంతా పడుతూంది / కనుకనే నా జ్వాలిక! నా దేశపు నాలిక''! ఈ జ్వాలిక స్వతంత్రమైందీ, ఈ దేశంలో జన జీవిత బాధమయమైందీ మండే సూర్యుడు, నాదేశం, నా ప్రజలు, గొరిల్లా మొదలైన కృతులు ప్రవాహ సదృశంగా వెలువడినాయి. ఇవన్నీ కలిసి స్వేచ్ఛా కవిత్వంలో 'ఆధునిక మహాభారతం' పేరుతో, వస్త్వైక్యాన్ని భావింపజేయడం జరిగింది. ''పీడిత ప్రజలకే ఈ భూమి సంక్రమిస్తుందిరండి! పాతి పెట్టిన ఉషస్సును బయటికి తీద్దాం! భూమిని చీల్చి దున్నుదాం రండి!'' పీడిత జన శ్రేయో మార్గం గల వస్తువుకూ, శక్తివంతమైన భావచిత్రణకూ నిలయమైన కవితారూపం అనుభవానికి వస్తుంది. స్వేచ్ఛా కవిత్వంలో శేషేంద్ర శర్మ ఆధునిక భారతం, అయస్కాంత శక్తితో ఆకర్షిస్తుంది. భావ రూపాలు మనస్సును ప్రభావితం చేస్తాయి. అర్థస్ఫూర్తి, ప్రతీయమాన శక్తిని కలిగిందీ. ఇది భౌతిక మానసిక తాత్త్విక స్థాయిల్లో ఆలోచన కందుతుంది. .రచనలో అభివ్యక్తి సౌందర్యం భావరూపాలు ప్రతీకల ప్రయోగంతో సంశ్లిష్టమైన సంవిధాన కళారూపాన్ని పొందింది. ఈ విధంగా స్వేచ్ఛా కవిత్వంలో విశిష్టమైన వ్యక్తిత్వాన్ని భావింపజేస్తుంది.

''రాజకీయ సిద్ధాంతాన్ని కౌగిలించుకోవచ్చు. రాజకీయ పార్టీలకు కవి దూరంగా ఉండాలన్నదే'' ఈయన దృఢవిశ్వాసం. కవి ''సర్వకాలాల్లో సర్వావస్థల్లో స్వతంత్రుడు''గా ఉండాలన్నదే చిరాశయం. లేకుంటే ''అసలు కవే కాడన్నదే'' ఈయన నిశ్చయం. ఈ విధమైన మార్క్సిజంపై అభిమతా, అనుభూతి కళపై అభిలాష, సౌందర్యాస్వాదనంపై అనురక్తిచేత శేషేంద్రశర్మ కవిత్వం స్వేచ్ఛాకవిత్వంలో సామ్యవాద కళాత్మక పార్శ్వంగా సమాలోచన కందుతుంది.

# 'అమ్మా! నన్ను బయటికి రానివ్వవూ'?

– కిట్టు

అది లీనార్డోడావిన్సీ (Leanardo da Vinci) గీసిన చిత్రం 'తల్లి గర్భంలో శిశువు గాఢనిద్రలో ఉన్నాడు ఆ ఇరుకయిన చీకటి కుహురంలో నుండి రంగులతో, వెలుతురుతో నిండిన విశాల ప్రపంచంలోకి అడుగు పెట్టాలని దీర్ఘంగా, ప్రశాంతంగా నిరీక్షిస్తున్నాడు.

తల్లి గర్భం నుండి శిశువు విడుదల మాతృమూర్తి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఉంటుందని నమ్మే ఎక్కువ మంది నమ్మకాన్ని ఈ బొమ్మ వ్యక్తీకరిస్తుంది 20వ శతాబ్దపు చాలా మంది శాస్త్రవేత్తలు కూడా ఇదేవిధంగా అభిప్రాయపడుతున్నారు కానీ ఇటీవల పరిశోధనలు చాలా ఆసక్తికరమైన, ఆశ్చర్యకరమైన ఫలితాలను వెలువరిస్తున్నాయి.

శిశువు ప్రసవానికి కారకమౌతున్న పరిస్థితులు గురించి చాలాకాలంగా పరిశోధకులు నమ్ముతూ వస్తున్నది ఏమిటంటే - తల్లి గర్భసంచీ పరిమాణం ప్రసవ సమయాన్ని నిర్ణయిస్తుందని. తల్లి గర్భసంచీ లేక గర్భ ద్వారం శిశువుని ఇముడ్చుకోలేని స్థాయికి శిశువు పరిమాణం ఎదిగినప్పుడు - శిశువుని బయటకునెట్టే ప్రయత్నంలో శిశువు ప్రసవం జరుగుతుందని భావిస్తూ వస్తున్నారు.

వీరిప్రకారం ఏ తల్లి గర్భసంచీ అయితే ఎక్కువ సాగే గుణముంటుందో ఆ తల్లి గర్భంలో శిశువు ఎక్కువ కాలం ఎదుగుతాడు. గర్భసంచీ సాగేగుణం ప్రకారం ప్రసవం తొందరగా అవటమో, సమయానికి అవటమో, ఆలస్యంగా అవటమో అన్నది ఆధారపడి ఉంటుంది.

1933లో పెర్సీమాల్పాస్ (Percy Malpas) పరిశోధనా ఫలితాలు కొత్త ఆలోచనలకు ఊపిరి పోసాయి. పెర్సీమాల్పాస్ బ్రిటన్‌కు చెందిన ప్రసూతీ వైద్యులు. అనెన్సఫలి (Anencephaly) అనబడే బుద్ధిమాంద్యతతో బాధపడే శిశువులను పరిశీలించినప్పుడు వింత విషయం బయటపడింది ఈ శిశువులందరి ప్రసవం చాలా ఆలస్యంగా జరిగింది. శిశువు మెదడు ఎదుగుదలకు, ప్రసవానికి ఏదో సంబంధం ఉన్నదని ఈ ఫలితాలు సూచిస్తున్నాయి.

1950లో ఈ విషయం మరింతగా ధృవపడింది. ఇడాహో (Idaho) కొండ ప్రాంతంలో ఒంటి కంటి గొర్రెలు పుట్టడం జరిగింది. ఆ ప్రాంతంలో దొరికే విషపూరితమయిన అడవి క్యాబేజీ వీటి జననానికి కారకమయినది. వీటి ప్రసవం చాలా ఆలస్యంగా జరిగింది. మామూలు గొర్రెలు 150 రోజులు గర్భంలో ఉంటే, ఏకాక్షి గొర్రెలు మాత్రం 250 రోజులు దాకా గర్భంలో ఉన్నాయి. ఈ గొర్రెలు పుట్టేసమయానికి సాధారణ శిశువులకు రెండింతలు పరిమాణంలో ఉన్నాయి. వీటి మెదడును పరిశీలించినప్పుడు కొన్ని భాగాలలో అపరిపక్వమైన ఎదుగుదల కనిపించింది. శిశువు ప్రసవానికి, శిశువు మెదడు ఎదుగుదలకు ఉన్న ముఖ్యమయిన సంబంధాన్ని ఈ ఫలితాలు ధృవపరుస్తున్నాయి.

కానీ మెదడులో ఏ ఏ భాగాలు ప్రసవాన్ని నియంత్రిస్తున్నాయో తెలియవలసి ఉంది. ఈ పరిశోధనలో భాగంగా నేషనల్ ఉమన్స్ హాస్పటల్-హాక్‌లాండ్‌కు చెందిన మాంట్ లిగ్గిన్స్ (Mont Liggins) కొన్ని ప్రయోగాలు నిర్వర్తించారు. గర్భస్థ శిశువు మెదడుకు శస్త్ర చికిత్స జరిపి వివిధ

భాగాలని తొలగించి వాటి ప్రభావం శిశువు ప్రసవం మీద ఎలా ఉంటుందో అని పరిశీలించారు మెదడులోని హైపోథాలమస్, పిట్యూటరీగ్రంధికి సంబంధించిన భాగాలును తొలిగించిన పిండాలలో ప్రసవం ఆలస్యమయినది ఒంటి కంటి గొర్రెలలో కూడా ఈ భాగాలలోనే అభివృద్ధి లోపం కనిపించింది శిశువు ప్రసవంలో ఈ భాగాలు చాలా ముఖ్యమైన పాత్ర పోషిస్తున్నాయని అర్థమవుతుంది

హైపోథాలమస్ శిశువు ప్రసవంలో ఏ విధమయిన పాత్ర పోషిస్తున్నదో తెలుసుకోవాలంటే ముందుగా హైపోథాలమస్ ఏ ఏ పనులు చేస్తుందో తెలుసుకోవాలి.

హైపోథాలమస్ మన మెదడులోని అతి ముఖ్యమయిన అవయవం. మనం ఏదయినా విపత్కర పరిస్థితులను ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు ఇది పనిచేస్తుంది. ఆకలి, దాహము, బాధ, నొప్పి, భయము, ప్రమాదము వంటివి కలిగినప్పుడు హైపోథాలమస్ వెంటనే ఆవిషయాన్ని పిట్యూటరీగ్రంధికి తెలియజేస్తుంది. పిట్యూటరీగ్రంధి తిరిగి ఆసమాచారాన్ని అడ్రినల్గ్రంధికి తెలియజేస్తుంది. ఇలా తెలియచేయడానికి వార్తాహరులుగా హార్మోన్లను వాడుకుంటాయి. హైపోథాలమస్, పిట్యూటరీగ్రంధులు ఈ పనికి CRH, ACTH అనే హార్మోన్లను వార్తాహరులుగా ఉపయోగించుకుంటాయి. ఎప్పుడైతే అడ్రినల్ గ్రంధికి ఈ సమాచారాం అందుతుందో అది ఇంకోరకమయిన హార్మోనును ఉత్పత్తిచేస్తుంది. ఇలా ఉత్పత్తి అయిన కార్టిసాల్ హార్మోను పరిస్థితులకు అనువుగా పునః స్పందనలను సిద్ధంచేస్తుంది. అది మనల్ని ఆహారం భుజించేటట్లు, దప్పిక తీర్చుకునే టట్లు, బాధనుండి నివారణకు ప్రయత్నించేటట్లు, ప్రమాదాన్ని ఎదుర్కొనేటట్లు, లేకపారిపోయేటట్లుగా చేస్తుంది.

పిండదశలో ఉన్న గర్భస్థ శిశువు (గొర్రె) లను పరిశీలించినప్పుడు, ప్రసవానికి దగ్గరలో ఉన్న శిశువులలో హైపోథాలమస్ చురుకుగా పనిచేయడము, వాటిరక్తంలో CRH, ACTH హార్మోన్లు ఎక్కువ పరిమాణంలో కనిపించడము జరిగింది. అంటే ప్రసవానికి దగ్గరలో ఉన్న శిశువులలో ఏవో కారణాలవలన హైపోథాలమస్ ప్రేరేపింపబడుతుందన్నమాట.

అంతేకాకుండా ఈ హైపోథాలమస్ ప్రసవానికి తల్లిని ప్రేరేపిస్తుందనడానికి ఆధారము కూడా దొరికింది. ఈ భాగాలను తొలగించిన పిండాలలో కానీ, ఈ భాగాలు పనితీరులో లోపమున్న శిశువులలో కానీ, ఈ హార్మోను సరిగ్గా (ACTH, CRH, Cortisol) ఉత్పత్తికాని శిశువులలో కానీ ప్రసవం ఆలస్యంగా జరిగింది. ప్రసవానికి, శిశువు మెదడులోను, శరీరంలోను ఈ విధమయిన ప్రతి చర్యలు అవసరం.

ఈ ఫలితాలను ఆధారం చేసుకొని ఆస్ట్రేలియాలోని అడిలైడ్ విశ్వవిద్యాలయానికి చెందిన మెక్మిలన్ ఒక సిద్ధాంతం చేస్తున్నారు. ప్రసవానికి దగ్గరలో ఉన్న శిశువులలో హైపోథాలమస్ చురుకుగా పనిచేయడం వలన కర్టిసాల్ హార్మోను ఉత్పత్తి జరిగి అది బొడ్డు త్రాడు ద్వారా తల్లిని చేరి, తల్లిలో కొన్నిరకాలయిన హార్మోన్లు ( ఉదా: ఈస్ట్రోజన్) ఉత్పత్తిని ప్రేరేపిస్తుంది. ఈ హార్మోన్లు గర్భద్వారాన్ని చేరుకొని కొన్ని రసాయనిక చర్యలద్వారా నొప్పులు తెప్పించి ప్రసవానికి కారకమవుతాయి. గొర్రెలలో ఈ విధమయిన మార్పులను గమనించారు.

చాలామంది శాస్త్రవేత్తలు ఈ సిద్ధాంతంతో ఏకీభవిస్తున్నప్పటికీ ఏ కారణాల వలన హైపోథాలమస్ ప్రేరేపింపబడుతున్నదనే విషయంలో ఏకాభిప్రాయం లేదు కొంతమంది హైపోథాలమస్ ప్రేరణకు తిరిగి తల్లేకారణం అని చెబుతున్నారు. తల్లిలో ఉత్పత్తయిన హార్మోన్లే శిశువు హైపోథాలమస్ మీద ప్రభావం చూపి అది చురుకుగా పనిచేసేటట్లు చేస్తుందని వారి నమ్మకం.

మరికొంతమంది హైపోథాలమస్ పూర్తిగా ఎదగగానే చురుకుగా పనియేయడం మొదలుపెట్టి ప్రసవానికి ప్రేరేపిస్తుందని భావిస్తున్నారు. కానీ చాలామంది ఈ విషయాన్ని అంగీకరించటంలేదు. శిశువు ప్రసవం ఏదో ఒక భాగం అభివృద్ధి మీదకాక శిశువులో సంపూర్ణమయిన పరిపక్వమయిన అభివృద్ధిమీద ఆధారపడి ఉంటుందని వీరంటారు.

మెక్‌మిలన్ మాత్రం వీటికి విరుద్ధమయిన, ఆసక్తికరమయిన కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నారు. శిశువు చివరి రోజులలో తీవ్రమయిన ఒత్తిడిని ఎదుర్కొంటుందని అందువల్లనే హైపోథాలమస్ ప్రేరేపించబడుతుందని మెక్ మిలన్ వాదన. ప్రసవసమయానికి కొద్ది వారాలుముందుగా శిశువు రక్తంలో అధిక పరిమాణంలో కనిపించే CRH, ACTH, కార్టిసాల్ హార్మోన్లే దీనికి ఆధారం అని మెక్‌మిలన్ అభిప్రాయం.

అయితే ఇక్కడ ఒక విషయం గమనించాలి. కార్టిసాల్‌హార్మోనుకు అద్భుతమయిన లక్షణం ఉన్నది. కార్టిసాల్‌పరిమాణం ఒకస్థాయికి చేరుకోగానే అది హైపోథాలమస్‌ను పనిచేయనీకుండా చేస్తుంది. ఎప్పుడయితే హైపోథాలమస్ పనిచేయడం ఆగిపోయిందో కార్టిసాల్ ఉత్పత్తి కూడా ఆగిపోతుంది. ఈ విధంగా కార్టిసాల్ తనను తాను నియంత్రించుకుంటుంది. అందువలన ఆరోగ్యకరమైన సాధారణజీవులలో కార్టిసాల్ ఒక పరిమాణానికి మించి కనిపించదు.

దీనికి విరుద్ధంగా శిశువు చివరి రోజులలో అధికస్థాయిలో కార్టిసాల్, CRH, ACTHలు కనిపించాయి. దీనికి కారణం శిశువులలో కార్టిసాల్ హార్మోను హైపోథాలమస్ మీద ప్రభావం చూపకపోవడమేమోనని భావించారు. అయితే గర్భస్థ శిశువుల రక్తంలోకి కార్టిసాల్ హార్మోనును ప్రవేశపెట్టినప్పుడు CRH, ACTHల ఉత్పత్తి ఆగిపోయింది కానీ ప్రసవానికి దగ్గరలో ఉన్న శిశువులలో మాత్రం ఇలా జరగలేదు. కార్టిసాల్‌సంకేతాలను హైపోథాలమస్ ఖాతరు చేయటం లేదు. కార్టిసాల్ సంకేతాలను అధిగమించి హైపోథాలమస్ CRH, ACTHలను ఉత్పత్తి చేస్తుంది. ఇలా జరిగేందుకు ఏదో కారణముండి ఉంటుంది.

శాన్‌ఫ్రాన్సిస్కోలోని క్యాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన Marry Dollman ఎలుకలలో ఒత్తిడి ప్రభావం గురించి పరిశోధిస్తున్నప్పుడు ఒక అసాధారణ విషయం బయటపడింది. సాధారణ ఎలుకలలో కార్టిసాల్ తననుతాను నియంత్రించుకొంటుంది. అదే ఎలుకలను చాలాకాలం సేపు ఒత్తిడికి గురిచేసినప్పుడు కానీ ( దరిదాపు 30ని పైగా), చాలాసార్లు ఒకే విధమయిన ఒత్తిడికి గురిచేసినప్పుడు కానీ కార్టిసాల్ స్వయంనియంత్రను కోల్పోయి అధికంగా ఉత్పత్తికావడం జరిగింది.

శిశువులు కూడా చివరిరోజులలో (ప్రసవానికి ముందు) ఈ విధమయిన దీర్ఘకాలికమైన, పునరావృతమయ్యే ఒత్తిడికి లోనవుతారని Mec Millan అభిప్రాయం. అందువల్లనే వాళ్ళలో నిరంతరంగా కార్టిసాల్ ఉత్పత్తి అవుతుంది. కానీ శిశువులు ఏ విధమయిన ఒత్తిడిని ఎదుర్కొన వలసి వస్తుంది? ఎందుకు ఒత్తిడికి గురవుతుంది? అన్నవి చాలా ముఖ్యమైన ప్రశ్నలు

దీనికి సమాధానం NPY అనే రసాయనం ద్వారా లభించింది. మన శరీరంలో ఆహారపు నిలువలు తరిగినప్పుడు కొవ్వుకణాలు లెప్టిన్ (leptin) అనే రసాయనాన్ని ఉత్పత్తిచేస్తాయి. ఈ లెప్టిన్ రసాయనం హైపోథాలమస్ మీద ప్రభావం చూపించి NPY (Neuro Peptide-y)ను ఉత్పత్తి చేసేటట్లు చేస్తుంది NPY ఉత్పత్తి కాగానే మనకు ఆకలి కలుగుతుంది. NPY ఆకలిని కలిగించే చాలా శక్తివంతమయిన రసాయనం. NPY ఉత్పత్తయిన తరువాత ఆకలి తీర్చుకోపోతే అవి మరింతగా ఉత్పత్తిఅయ్యి హైపోథాలమస్ మీద తిరిగి ప్రభావం చూపి ఒత్తిడికి గురిచేస్తుంది. ఈ ఒత్తిడికి స్పందనగా మనలో Certisol హార్మోను ఉత్పత్తి అవుతుంది. అందువలనే మనం ఆకలిని వెంటనే తీర్చుకోపోతే మనలో ప్రతిచర్యగా ఒత్తిడికి సంబంధించిన స్పందనలు కలుగుతాయి.

ప్రయోగశాలలో ఎలుకలకు ఆహారాన్ని ఇవ్వకుండా చేసినప్పుడు NPY వాటిలో అధికంగా ఉత్పత్తి అయ్యింది. అలాగే ఎలుకలకు NPYను బయటనుండి ప్రవేశపెట్టినప్పుడు అవి అతిగా భుజించి చాలా లావుగా బూరెల్లాగా తయారయ్యాయి. ప్రసవానికి ముందుకూడా శిశువులలో NPY (దరిదాపు నాలుగు రెట్లు) అధిక పరిమాణంలో కనిపించింది. అంటే శిశువు ప్రసవానికి ముందు తీవ్రమయిన ఆకలికి గురవుతుందన్నమాట.

Mec Millan ప్రకారం శిశువు గర్భంలో ప్రాణం పోసుకున్నప్పటి నుండి తల్లిదగ్గరనుండి ఆహార సరఫరా జరుగుతూ ఉంటుంది. ఇది తల్లి నుండి బొడ్డుత్రాడు ద్వారా శిశువుకు చేరుతుంది. తల్లిరక్తానికి, శిశువు రక్తానికీ మధ్య పలుచని పొర అడ్డుగా ఉంటుంది. ఈ పలుచని పొర ద్వారా కూడా ఆహార సరఫరా జరుగుతుంది. ఏ విధంగా అంటే తల్లిరక్తం, శిశువురక్తం కన్న అధికసాంద్రత కలిగి ఉంటుంది. అందువలన అది పలుచని పొరను అధిగమించి శిశువురక్తాన్ని చేరుతుంది. గర్భం ధరించిన మొదటిరోజులలో పిండానికి ఆహారపు అవసరం పెద్దగా ఉండదు కానీ శిశువు ఎదిగే కొద్దీ ఆహారపు అవసరం పెరుగుతూ ఉంటుంది. కానీ శిశువు పెరిగేకొద్దీ శిశువురక్తంలోని చక్కెర, ప్రాణవాయువుల. సాంద్రత తగ్గుతూ వస్తుంది. తల్లిరక్తానికి, శిశువురక్తానికి సాంద్రతలో భేదం పెరుగుతున్న కొద్దీ ఆహారసరఫరా వేగవంతమవుతుంది. గర్భంలో సగకాలం గడిపే సరికి శిశువులో చక్కెర, ప్రాణవాయువుల పరిమాణం 20 శాతం వరకు తగ్గిపోతుంది. శిశువు పూర్తిగా ఎదిగే సమయానికి వాటి పరిమాణం మరింత తగ్గిపోతుంది. శిశువు ప్రమాదంలో పడుతుంది. తల్లినుండి ఎంతవేగంగా ఆహార సరఫరా జరిగినప్పటికీ ఇది శిశువుకు సరిపోదు.

అందువలన శిశువులో NPY ఉత్పత్తి జరుగుతుంది. NPY ఉత్పత్తిఅయినప్పటికీ కూడా శిశువుకు తగినంత ఆహారం దొరికే మార్గం లేదు. అందువలన NPY అధిక శాతం ఉత్పత్తి జరిగి హైపోథాలమస్‌ను

ఒత్తిడికి గురిచేసి కార్టిసాల్ ఉత్పత్తి అయ్యేటట్లు చేస్తుంది ప్రసవానికి ముందు, చివరి రోజులలో శిశువు ఈ విధమయిన ఒత్తిడికి ఎక్కువకాలంపాటు, తరచూ గురవ్వడంవలన కార్టిసాల్ స్వయం నియంత్రణను కోల్పోయి అధికంగా ఉత్పత్తి అవుతుంది ఇలా ఉత్పత్తి అయిన కార్టిసాల్ రక్తంద్వారా తల్లిని చేరుకుని ఈస్ట్రోజన్ ఉత్పత్తిని ప్రేరేపిస్తుంది ఈస్ట్రోజన్ తల్లి గర్భద్వారాన్ని చేరుకొని రసాయనిక చర్యల ద్వారా నొప్పులు కలిగించి ప్రసవానికి సన్నద్ధం చేస్తుంది అంటే శిశువు తనదయిన భాషలో ''అమ్మా ఆకలికి తట్టుకో లేకపోతున్నా నన్ను బయటకు రానివ్వవూ'' అని తల్లికి చెప్పడం అన్నమాట.

ఇదే అభిప్రాయాన్ని గ్రీకు తత్వవేత్త హిప్పొక్రటిస్ (Hippocrates) కొన్ని వందల ఏళ్ళకుముందే ప్రతిపాదించాడు గుడ్డు నుండి పిల్లకాని, గర్భం నుండి శిశువుకానీ బయటకు రావడానికి కారణం అప్పటివరకు వాటికి రక్షణ కల్పించిన ఆ నివాసస్థానాలు ఇక ఏమాత్రం నివాసయోగ్యం కాకపోవటమేనని హిప్పొక్రటిస్ ప్రతిపాదించాడు. కానీ ఎందువలన అవి నివాసయోగ్యం కాలేకపోతున్నాయో ఆయన వివరించ లేకపోయాడు.

గర్భంతో ఉన్న గొర్రెలకు ఆహారాన్ని సరిగ్గా అందించనప్పు డు ఆ గొర్రెలు సాధారణ సమయంకంటే చాలా ముందుగా ప్రసవించాయి అంటే పిల్లకు ఎప్పుడైతే ఆహారకొరత ఏర్పడుతుందో అప్పటినుండి ప్రసవానికి సంబంధించిన పని మొదలవుతుంది. భారత దేశంలో పేదస్త్రీలు చాలామంది చాలా ముందుగా ప్రసవించి అపరిణిత శిశువుల జననానికి ఎందుకు కారకమవుతున్నారో దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు. అదే విధంగా భాగ్యవంతులలో సరైన ఆహారం తీసుకోవటం వలన పూర్తికాలం గర్భం ధరించి ఆరోగ్యవంతమైన శిశువులను కనగలుగుతున్నారు

కానీ కొంతమంది ఈ వాదనతో విభేదిస్తున్నారు. గర్భంలో ఏర్పడే ప్రతికూల పరిస్థితులు జననానికి కారణమైవుండక పోవచ్చునని, ప్రకృతి మనం ఊహించిన దానికంటే చాలా తెలివిగా ప్రవర్తిస్తుందని వీరి అభిప్రాయం.

శిశువు జననానికి మెక్‌మిలన్ చెప్పిన ఒక్క ఆహార కొరతమాత్రమే కాక ఇంకా మిగిలిన కారణాలుకూడా ఉండవచ్చు. అయినా కానీ ఈ రంగంలో ఇప్పటి వరకు జరిగిన ఈ పరిశోధనలు ఒక పెద్ద ముందుడుగు. శిశుజననానికి కారకమయిన అన్ని పరిస్థితులను తెలుసుకున్నప్పుడు అపరిణితమైన, అనారోగ్యకరమైన శిశుజననాలను నివారించవచ్చు. ఒక్కసారి శిశువు ప్రసవానికి సంబంధించిన పని తల్లిలో మొదలయిన తరువాత మనం ఏమాత్రం శిశువు ప్రసవాన్ని ఆపలేము. అలాకాకుండా శిశువు ప్రసవానికి కారకమైన పరిస్థితులను నిరోధించటం వలనసమయానికంటే ముందుగా ప్రసవం జరగకుండా కాపాడుకోవచ్చు.

ఈ లోపుగా తల్లీ పిల్లలలో ఎవరిది పై చేయి అవుతుందో వేచి చూడాలి. లియోనార్డో డావిన్సీ శిశువు లాగా శాస్త్ర వేత్తల పరిశోధనా ఫలితాల గురించి నిర్లిప్తంగా నిరీక్షిద్దాం.

ఆధారం : 'LET ME OUT' Published in The Hindu from 'New Scientist'

# అమెరికా కవి కారల్ శాండ్‌బర్గ్

– శివలింగం

ఎర్నెస్ట్ హేమింగ్వే (1899 - 1961) నోబుల్ బహుమతి వచ్చిన సంవత్సరం 1954 లో ఈ గౌరవం కారల్‌శాండ్ బర్గ్‌కు రావలసిందన్నాడు. శాండ్‌బర్గ్ 6 జనవరి 1878లో ఇలినాయిస్‌లోని గేల్సుబర్గ్‌లో పుట్టాడు. 89 సంవత్సరాలు జీవించి 22 జులై 1967 లో మరణించాడు

Death Comes Once, Let ıt be easy అంటూ ఆయన రాసిన Fınish గీతం నిజమయింది. కొత్తపద్యంరాసినా, దూరదర్శన్‌లో కనిపించినా, ఉపన్యాసించినా జనం అభిమానంతో తిలకించేవారు. ఇంతటి ప్రజాభిమానం చూరగొన్నవారు వాల్ట్‌విట్‌మన్ (1819 - 1892) ఒక్కడే సంప్రదాయ కవితా మార్గాన్ని విడనాడాడు. సంభాషణాత్మకశైలిని అలవరచుకున్నాడు. ప్రాసను, లయను వదిలేశాడు. చికాగో వంటి పద్యాల్లో సుదీర్ఘ వాక్యాలతోరాశాడు. కొందరు విమర్శకులు రాబర్ట్ ఫ్రాస్టు (1874 - 1963)తో పోల్చారు. ఇరువురూ ఒకే తరానికి చెందినవారు. సామాన్య మానవుని గురించి రాశారు. సామాన్యుల భాషలో వ్యక్తీకరించారు. రచనాతత్వంలో భేదం వుంది ఇద్దరి కవిత్వానికి మానవుడే కేంద్రం. శాండ్‌బర్గ్‌ది సామూహిక ప్రజాకవిత్వం అయితే ప్రాస్టుది వైయక్తిక కవిత్వం.

ప్రాస్టు న్యూ ఇంగ్లండులో తన జీవితాన్ని గడిపాడు. పట్టణాల్లోను, పొలాల్లోను వుండే ప్రజలవైయక్తిక జీవితాన్ని వ్యక్తీకరించాడు. శాండ్‌బర్గ్ మిడ్‌వెస్టునుంచి వచ్చినవాడు. కవిత్వానికి నగరునాగరిక జీవితం శాండ్‌బర్గ్‌లో దర్శనమిస్తుంది. శాండ్‌బర్గ్ కవిత్వం అమెరికా వాస్తవికతా, స్కేండినేవియామార్మికతల సమ్మేళనం.

శాండ్‌బర్గ్ కవిత్వాన్ని విషయవస్తువును బట్టి త్రివిధాలుగా విభాగించవచ్చు.

1. తాత్విక లలితగీతాలు 2. సామాజిక కవిత్వం 3. పెద్ద నగరాల మీద రాసిన కవిత్వం నిగూఢమైన, అర్థంకాని అభివ్యక్తీకరించలేని మానవ గుణాలను పట్టుకోడానికి చేసే ప్రయత్నమే కవిత్వమంటాడు. పదాలకు అందనీ భావాల వ్యక్తీకరణ కవిత్వం. 'గుడ్‌మార్నింగ్ అమెరికా' లో 38 కవిత్వ నిర్వచనాలిచ్చాడు. శాండ్‌బర్గ్ గొప్ప కవిత్వంగా పేరు తెచ్చుకున్న గ్రంథం The People Yes. (1936). ఈ పద్యం చదవటానికి మూడు గంటలు పడుతుంది. చివరి పుస్తకం 'హనీ అండ్ సాల్ట్ ' 1963లో వచ్చింది, పులిట్జర్ బహుమతి వచ్చింది. మేల్, హార్వార్డు లనుంచి గౌరవ పురస్కారాలు అందుకొన్నాడు. అబ్రహాం లింకన్ జీవిత చరిత్రను మొత్తం ఆరు వాల్యూముల్లో వెలువరించిన ఘనత శాండ బర్గ్‌దే. The Prdırıe years 2 Volumes 1926

The War years (4 Volumes) 1939. అమెరికా అంతా తిరిగాడు. ప్రజల్ని కలుసుకున్నాడు. వారి గాథల్ని విన్నాడు. అమెరికా దేశ అందాలను రంగుల్ని రాగాల్ని తనలో లీనం చేసుకున్నాడు. 1945లో నార్త్ కరోలినాలోని ఫ్లాట్‌రాక్ ఓల్డ్ ఎస్టేట్‌కు తరలివెళ్లాడు. 72 సంవత్సరాలు వచ్చినా

క్రియల్ని, నామవాచకాలతో వాటికి వున్న రహస్యాల్ని పరిశీలిస్తూనే వున్నాడు. మొదటి కవితా సంకలనం రాసినప్పటికి. మరణ సమయానికి ఎంతో మార్పును చూచాడు. మానవ జీవితం గాలిలో దీపం అన్నాడు మృత్యువు కన్నా సత్యం, కాలంకన్నా అసత్యం మరొకటిలేదు. అడవిలో పక్షుల్లా మానవులు జీవిస్తారు సమయం ఆసన్నమైనపుడు ఒక్కొటి ఎగిరిపోతుంది అల తరవాత అలలాగ పాతవాళ్ల స్థానాల్ని కొత్తవాళ్లు స్వీకరిస్తారు.

శాండ్‌బర్గ్ కవిత్వం చదువుతుంటే పరాయి కవిత్వంగా అనిపించదు. భాషవేరు. 11 కవితా సంకలనాలు, అబ్రహంలింకన్ జీవిత చరిత్ర ఇంకా ఇతర రచనలు చేసిన చరిత్రకారుడు, ప్రజాకవి శాండ్‌బర్గ్ మరవలేని మరపురాని మహనీయుడు. శాండ్‌బర్గ్ చికాగో కవితలు అని ఒక కవితా గ్రంథం వెలువరించాడు. శాండ్‌బర్గ్ జన్మభూమి మీద మంచి కవిత్వం రాశాడు. అమెరికాలోని పన్నెండు రాష్ట్రాల్లో మిడ్‌వెస్ట్ నాల్గోవంతు భూభాగం ఆక్రమించింది. ప్రయిరీ, గోధుమ పొలు, స్త్రీల కళ్ళు ఆయనకు పాటను పదాన్నిచ్చాయి

పశ్చిమాన మిస్సోరి, తూర్పున ఓహియో నదులు మిసిసిపి నది Father of Waters, ఉత్తరాన అయిదుపెద్ద సరస్సులు 1600 కిలోమీటర్లు ఆక్రమించాయి మిడిల్‌వెస్ట్‌లో వేసవిలో పల్చని గుడ్డ, చలికాలం ఉన్ని దుస్తులు వాడాల్సిందే, చికాగో గొప్పనగరం, The Windycity కవితల్లో బాగా వర్ణించాడు. అమెరికాలో రాష్ట్రాలు 19వ శతాబ్దంలో ఏర్పడినవే. శాండ్‌బర్గ్ కుటుంబం వలస వచ్చినవారే, తక్కువ కూలితో రైలు రోడ్లు నిర్మించే వారిని గురించి కవితలో వర్ణించాడు. శాండ్ బర్గ్, అతనితండ్రి కూడా కూలీలుగా పనిచేశారు. చికాగో పారిశ్రామిక నగరంగా ఎదిగింది. వయసులో చిన్నది, ఇప్పుడు అమెరికా నగరాల్లో రెండోది, విశాలమైన సారవంతమైన పంట పొలాలు, సంపన్నమైన గనులు, రద్దీగా వుండేనగరం. 'Tool Maker, Stacker of wheat, player with Rail Roads and the Nation's Freight Handler అన్నాడు శాండ్‌బర్గ్. ఫ్రాంక్ నారిస్ (1870 - 1902), థియోడర్ డ్రెయిసర్ (1871 - 1945) హెమింగ్వేవంటివారు చికాగో నుండి వచ్చిన నవలాకారులు, కథారచయితలు, ఇప్పటి చికాగో నాల్గవది, పయొనీర్, 19వ శతాబ్దార్థంలో రెండోది. 1871లో అగ్ని ప్రమాదం అనంతరం నిర్మించింది. మూడోది, నాల్గవది ఆకాశహార్మ్యాలతో, పారిశ్రామిక అభివృద్ధితో నిర్మించింది. ధనమే పరమ ధర్మమని, ధనంలోనే సర్వమూ ప్రతిష్ఠిత మయిందని మహాభారతంలో వుంది ధనం కలిగినవాడే జీవిస్తాడు. లేనివాడు మృతుడే. ధనంగురించి శాండ్‌బర్గ్ ఒక కవితలో గొప్పగా చెప్పాడు.

ధనమే శక్తి, ధనమే మెత్తని పరుపు, సకల పాపాలకు ధనమే మూలం, ధనమంటే స్వేచ్ఛ పాతసామెత. ఇంతేకాదు ధనముంటే కోరింది యిస్తుంది. నీకు ధనం వుంటే కూడు, గూడు, గుడ్డ, పొలం, తుపాకులు, నగలు, ఆడా, మగ, సోమరితనం సంగీత శ్రవణం - అన్నింటినీ కొంటుంది ధనం.

ప్రేమ, ఆత్మీయత, స్వేచ్ఛ, అమరత్వం, నిశ్శబ్దం, శాంతి - వీటిని కొనలేదు ధనం.

# భారతీయులకు ఆత్మీయుడు మాక్స్‌ముల్లర్

- డా. యస్. నరసయ్య

సర్ విలియంజోన్స్ యూరోప్ ఖండవాసిగా ప్రప్రథమంగా సంస్కృత భాష నేర్చిన మహానుభావుడు. అతని అభిజ్ఞాన శాకుంతలం ఆంగ్లానువాదం సంస్కృతభాషకు ఖండాంతర ఖ్యాతి నార్జించుటేగాక ఆధునిక భాషాశాస్త్రానికి పునాదులువేసింది ఈ అనువాదం చదివి జర్మన్ మహాకవి గోధె కాళిదాసుని కళాప్రతిభలకు అప్రతిభుడై పట్టరాని ఆనందంతో నృత్యం చేసాడట. తర్వాతి కాలంలో జర్మనీ దేశీయులు ఎందరో సంస్కృతాధ్యాయానికి పూనుకొన్నారు వారిలో ప్రప్రథమంగా పేర్కొదగిన మహానుభావుడు మాక్స్‌ముల్లర్ పండితుడు. ఈయన కృషివల్ల విద్యావంతులైన ప్రపంచ మేథావులెందరో వేదాల ప్రాశస్త్యం తెలిసికొని ఇండాలజీ ( భారతీయతా శాస్త్రం) పట్ల అధ్యయ నాసక్తులైనారు.

ఫ్రెడ్రిక్ మాక్స్‌ముల్లర్, డెస్సా (Dessau) గ్రామంలో 6-12-1823లో జన్మించాడు. తండ్రి విల్‌హెల్మ్ ముల్లర్ గ్రంధాలయాధికారి మాత్రమేగాక సుప్రసిద్ధగేయకారుడు మాక్స్ ముల్లర్ లీప్‌జీగ్ (Leipzig) విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్రం, తత్త్వశాస్త్రం అధ్యయనం చేసాక హెర్మన్ బ్రాకస్ (Herman Brockhaus) మహాశయుని ప్రేరణతో సంస్కృతం అధ్యయనం చేసాడు. 1844లో బెర్లిన్ వెళ్ళి బాప్, షెల్లింగ్‌లవద్ద అధ్యయనం చేసాడు. ఆ తర్వాత సంవత్సరానికి ప్యారిస్ వెళ్లి ఈ. బోర్నఫ్ (E. Burnouf) వద్ద ఋగ్వేదం అధ్యయనం చేసాడు. ఈ అధ్యయన కాలం తన జీవితంలో కొత్త ప్రపంచ ద్వారాలు తెరుచుకున్నట్లు ఐందని జీవిత చరిత్రలో రాసుకున్నాడు. ఋగ్వేదాన్ని సాయణ భాష్యసహితంగా సత్వరమే అచ్చువేయడానికి నిర్ణయించుకొని 1846లో లండన్ వెళ్లాడు. ఈస్ట్ ఇండియా కంపెనీ ఈ గ్రంధ ముద్రణ వ్యయాన్ని భరించింది. 1849లో ప్రథమ సంపుటం అచ్చులో వెలుగు చూసింది. విశేషం యేమిటంటే అప్పటికి ముద్రాపకుడు, సంపాదకుడూ ఐన ఈ మహానుభావుని వయస్సు 26 సంవత్సరాలే. తక్కిన సంపుటాలు 1854, 56, 62, 74 సం॥ల్లో వరుసగా అచ్చైనాయి.

ప్రథమ ముద్రణలోనే మొదటి సంపుటం 500 ప్రతులే వేయబడి త్వరగా అమ్ముడైనాయి. ఆంధ్రదేశానికి చెందిన విజయనగరం సంస్థానాధిపతి పూసపాటి ఆనంద గజపతి మహారాజు రెండో ముద్రణ వ్యయాన్ని భరించాడు. ఈసారి ఖండాంతర ఖ్యాతినందుకొన్న ఈ రెండో ముద్రణలో ఋగ్వేదం బ్రాహ్మణాలతో కల్పి సాయణాచార్య భాష్యయుక్తంగా నాలుగు సంపుటాలలో లండన్‌లో

---

వీరు శ్రీలక్ష్మీ నరసింహ సంస్కృతాంధ్ర కళాశాల, ధర్మపురి, కరీంనగర్ జిల్లాలో ప్రిన్సిపాల్,
(13-08-92 నాటి సంస్కృత దినోత్సవ ప్రసంగం ఆధారంగా)

జరిగింది. ప్రథమ సంపుటంలోని మరుత్తుకు సంబంధించిన ఋక్కులను మాక్స్‌ముల్లర్ ఆంగ్లానువాదం చేసాడు. ఐతే ఈ అనువాదం అసంపూర్ణంగానే ఉండిపోయింది.

అతని కీర్తిసౌధానికి మూలస్థంభమైన "A History of Ancient Sanskrit Literature" గ్రంథం 1859 సం॥లో ప్రచురింపబడింది (1926లో ఇది పునర్ముద్రితమైంది) దీంట్లో ప్రాచీన ఆర్యజాతుల మతం గూర్చి సవివరంగా వర్ణించాడు. గ్రీక్, భారతీయ సంస్కృతుల తులనాత్మకాధ్యయనం చేసి ఈతడు ఈ గ్రంథంలో ఆర్యజాతివారి అత్యంత ప్రాచీన గ్రంథం ఋగ్వేదమని, ప్రపంచమానవుని తొలికావ్యంగా దీన్ని నిర్ధారించాడు.

మాక్స్‌ముల్లర్ అసాధారణ మేధావి మాత్రమే కాదు, అనన్య సామాన్య ప్రతిభాన్వితుడైన వక్త ఆయన సంస్కృత, వేదాలనుండి, ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యం నుండి ఉదాహరణలు తీసుకొని గంగా ప్రవాహంలా ఉపన్యసించేవాడు భారతీయ శాస్త్రాలమీద అనేక విశ్వసంస్థలు ఆయనను ప్రసంగాలకు ఆహ్వానించాయి. 1867 - 75 మధ్య, ఈ ప్రసంగాల్లో ముఖ్యమైనవి ముద్రితమైనాయి. తాను భాషా శాస్త్రజ్ఞుడైనా భాషా చరిత్ర కంటే మత చరిత్ర ప్రధానమైనదని మానవత్వపు చరిత్రే నిజమైన మతచరిత్ర కావాలని ఆశించాడు. వేదాలేకాకుండా ఇతర మత గ్రంథాలు అధ్యయనం చేసాడు. పార్శీల మత గ్రంథాలు, జెంద్ - అవెస్తా, బౌద్ధత్రిపిటకములను కూడా పరిశీలించాడు - సంస్కృత సాహిత్యాధ్యయనం వల్ల ఆయనకు అభిరుచిగల్గి పాళీ భాషలోని బౌద్ధవాఙ్మయం కూడా అధ్యయనం చేసే అవకాశం లభించింది. "Origin and Growth of Religion as illustriated by the religions of India", Interoduction to the Science of Religion అనే గ్రంథాలు అనితర సాధ్య ప్రతిభాన్వితాలైన ఆయన ప్రసంగాలకు గ్రంథ రూపాలే.

మత చరిత్రకు సంబంధించిన అతని గ్రంథాల్లో అత్యుత్తమమైనది "Religions scrptures in translation in the sacred books of the Eart" 50 సంపుటాలుగా 2 దశల్లో బయటకు వచ్చింది ఆ మహానుభావుని సర్వతోముఖ ప్రతిభకి ఈ సంపుటాలు తర్కాణాలు - ఈ సంపుటాల రచనా సంకల్పం 1874లో నిర్వహించబడిన ''ప్రాచ్య విజ్ఞానజ్ఞుల అంతర్జాతీయ సదస్సు'' లో కల్గింది ప్రధానమైన ఉపనిషత్తులు, వైదిక సంబంధమైన అనేక మంత్రాలు, ఋక్కులు, బౌద్ధ ధమ్మపదం వీటికి మాక్స్ ముల్లర్ అనువాదాలు ఈ సంపుటాల్లో వచ్చాయి.

భాషా శాస్త్రానికి సంబంధించిన అతని ప్రతిభ ఆయన ఉపన్యాసాల రూపంలో వెలువడి 1846 నుండి 14 సంపుటాలుగా అచ్చైయి Science of Language పేరుతో 1891 లో తిరిగి 2 సంపుటాలుగా సంపుటీకరించబడింది.

భారతీయులంతా తన్మయత్వంతో తనను ఆత్మీయునిగా చేసికొన్న ముల్లర్ సుప్రసిద్ధ గ్రంథం "India what it can teach us" - ఇండియన్ సివిల్ సర్వీస్ విద్యార్థుల నుద్దేశించి అతడు ప్రసంగించిన ప్రసంగాల సంపుటి. దీని ద్వారా ప్రాచీన భారతీయ సంస్కృతిపట్ల ప్రాధాన్యతను నొక్కి చెప్పాడు "The Renaissance of Sanskrit Literature" అన్న ఈ సంపుటిలోని ప్రసంగంలో శకరాజుల ఆక్రమణ తర్వాత సంస్కృత సాహిత్యాభివృద్ధిలో విఘాతం ఏర్పడిందని దీనికి జైన, బౌద్ధాలు కూడా కొంత దోహద పడ్డాయని, తిరిగి గుప్త రాజుల కాలాలలో సాంస్కృతిక పునరుజ్జీవనం జరిగిందని బ్రాహ్మణాల ఆధారంగా హిందూమతం పునరుజ్జీవితం ఐందని, సంస్కృత భాష తిరిగి ప్రోత్సహించబడిందని సిద్ధాంతీకరించాడు ఈ సిద్ధాంతం ఇప్పటికీ సర్వజనామోదంగా ఉంది. ఈ సిద్ధాంతం తర్వాతి చారిత్రక పరిశోధనలకు పునాది ఐంది. శాసనాల ఆధారంగా మాక్స్ ముల్లర్ ఈ సిద్ధాంతాన్ని తర్వాతి కాలంలో మరింత సంశోధితం చేసి పరిపుష్టం చేసాడు. సంస్కృత భాషా విద్యార్థులకు ప్రారంభ శిక్షణా గ్రంథాలు, వ్యాకరణం కూడా రాసాడీయన.

మాక్స్ ముల్లర్ అసాధారణ గ్రంథరాజాల్లో ఆఖరిది "The Six Systmes of Indian Philosophy" 1899లో అంటే ఆయన మరణానికి ఒక సంవత్సరం ముందు లండన్‌లో అచ్చైంది. భారతీయ తత్త్వ దర్శన భూమికగా పేరుగాంచిన ఈ గ్రంథం ఈ కోవలో మొట్టమొదటి గ్రంథం.

విజ్ఞాన భాస్కరుడు మాక్స్‌ముల్లర్ ఆక్స్‌ఫర్డ్‌లో 28-10-1900 తేదీన భౌతిక కాయాన్ని విసర్జించాడు. ప్రపంచ మేధావులందరికి ఆరోజు విషాద దినం. సర్వమానవాళి సంతాపం ప్రపంచ దేశాలనుండి తెలిపింది. ప్రపంచ వ్యాప్తవిజ్ఞాన వేత్తలంతా ఆ మహానుభావుని మనోజ్ఞమైన వ్యక్తిత్వానికి, వైదుష్యానికి నివాళులర్పించారు. ఆ మహానుభావుని మరణం వల్ల ''భారతదేశం ఒక ఉత్తమ స్నేహితుణ్ణి, ప్రేమికుడైన విజ్ఞానిని, అద్భుతమైన ప్రశంసకుణ్ణి కోల్పోయిందని'' లోకమాన్య బాలగంగాధర్ తిలక్ పేర్కొన్నాడు.

1901 లో ఆయన జీవిత చరిత్ర అచ్చైంది. తిరిగి ఆయన సతీమణి జార్జియా ముల్లర్ ''జీవితం, లేఖలు'' పేరిట 2 సంపుటాలుగా 1902 లో లండన్‌లో అచ్చు వేయించింది

జీవితంలో భారతదేశాన్ని దర్శించే ఆకాంక్ష పూర్తి చేసుకోలేని మాక్స్‌ముల్లర్ పునర్జన్మ అంటూ ఉంటే తిరిగి తాను భారతీయునిగా పుట్టాలని కోరుతూ తనకు భారత సంస్కృతి పట్లగల అపార గౌరవాన్ని వక్కాణించాడు. భారతమేధావులంతా ఆయనను ప్రేమతో మోక్షముల్లర భట్టు అని పిలుచుకొన్నారు. జర్మనీలోని గోథె సాంస్కృతిక సంస్థ భారతదేశంలో ఆ మహానుభావుని పేర మాక్స్ ముల్లర్ భవన్ నామంతో బెంగుళూరు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, హైదరాబాద్, మద్రాస్, పూణే నగరాల్లో సాంస్కృతిక కేంద్రాలు నెలకొల్పింది. ఈ నాటికి ఆ మహానుభావుని పేరు వింటే చాలు ఉభయదేశాల ప్రజలు వినమ్రులౌతారు.

# నవయుగ వైతాళికుడు - రాజా రామమోహనరాయ్

- దమ్మాలపాటి వెంకటేశ్వరరావు

మధ్యయుగపు అంధకార కుహరంలో కొట్టుమిట్టాడుతున్న భారతావనికి విజ్ఞాన దీపికనెత్తి మార్గదర్శకుడై అంచెలంచెలుగా అది శాస్త్ర సాంకేతిక విజ్ఞానాన్ని సంతరించుకొని ఆధునిక స్థాయికి చేరడానికి తగిన మానసిక వాతావరణాన్ని కల్పించిన ప్రథమ భారతీయుడు, మహామనీషి రాజా రామమోహనరాయ్ అని చెబితే అతిశయోక్తి ఎంత మాత్రం కానేరదు. అన్ని రంగాలలోను నిద్రాణమై, మృత ప్రాయమై, మూఢ విశ్వాసాల ఉక్కుపిడికిలిలో మూలుగుతున్న భారతదేశాన్ని జాగృతం చేయడానికి ఆయన చేసిన కృషిని అంచానవేయడానికి ఆనాటి సాంఘిక, రాజకీయ, ఆర్థిక, ధార్మిక స్థితి గతులను అర్థం చేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

అది మొగలాయి సామ్రాజ్యపు అవసాన దశ. ఢిల్లీ చక్రవర్తి రెండవ షా ఆలమ్ 1765లో బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రాల మీద దీవానీ అధికారాలను (పన్నువసూలు అధికారం) ఈస్ట్ ఇండియా కంపెనీకి దఖలు పరచి వారిచ్చే భరణం మీద బ్రతుకుతున్న రోజులవి. పేరుకుమాత్రం చక్రవర్తులు, నవాబులు అనిపించుకోవడమేగాని వారు తమ పూర్వవైభవానికి ప్రేత స్వరూపాలుగానే మిగిలిపోయారు. వాస్తవాధికారాలన్నీ కంపెనీ చేతిలో కేంద్రీకృతమయ్యాయి. ఈ ద్వంద్వ ప్రభుత్వం కూడ ఎంతో కాలం కొనసాగలేదు. 1772లో కంపెనీ వారు తామే స్వయంగా దీవాన్ పదవిని హస్తగతం చేసుకొని ద్వంద్వపాలనకు స్వస్తి చెప్పారు. సరిగా అదే సంవత్సరం రాజా రామమోహనరాయ్ హుగ్లీ జిల్లాలోని ఖనకూల్ - కృష్ణనగరానికి దగ్గరలో ఉన్న రాధానగర్‌లో జన్మించాడు.

**సామాజిక క్షీణత :** సమాజంలో అంతకు పూర్వమే ప్రారంభమైన క్షీణదశ ఔరంగజేబు అవలంబించిన ఉచ్ఛృంఖల వివక్షతో కూడిన ధార్మిక విధానం వల్ల పరాకాష్ఠకు చేరుకుంది. దీనికి తోడు మరాఠాలతో ఆయన సలిపిన యుద్ధాలు ప్రభుత్వ బొక్కసాన్ని ఖాళీ చేశాయి. ఫలితంగా హిందూ, ముస్లింలకు సంబంధించిన విజ్ఞాన పీఠాలు తేజోవిహీనమై పోయాయి. ఇకపోతే రహదారులు, కాలువలు, ఇతర ప్రభుత్వ పనులు స్తంభించి అత్యంత దయనీయస్థితికి చేరుకున్నాయి. ఒక రకంగా చెప్పాలంటే దేశం నిర్వీర్యమైపోయింది. రాజకీయంగా ఆశావాహ పరిస్థితులు మృగ్యం కావడంతో హిందూ సమాజం నిరాశా నిస్పృహలకులోనైంది. సమాజాన్ని యావత్తూ భయపిశాచం తన నీలినీడలలో ముంచివేయడంతో అది అంతర్ముఖియై అతీతంలో నివసించడం ప్రారంభించింది. అప్పటి వరకు సమాజాన్ని ఏకతాసూత్రంతో బంధించి ఉంచిన బ్రహ్మవాదం స్థానాన్ని భయం ప్రాతిపదికగా కలిగిన విచ్ఛిన్నకర సంకుచిత సాంప్రదాయిక శక్తులు ఆక్రమించుకున్నాయి. మేధావి వర్గానికి ధార్మిక గ్రంథాల వ్యాఖ్యానాలకు నిర్జీవ విశ్లేషణ చేయడం మాత్రమే వ్యాపకంగా మిగిలిపోయింది. ఆచార్యుల స్థానాన్ని పురోహిత వర్గం స్వీకరించింది. వారు తమ స్వప్రయోజన సిద్ధి కొరకు ఘనీభవించిన మూఢ విశ్వాసాలను సమాజంలో ప్రచలితం చేసి, కొనసాగించారు. శిశు మేధయజ్ఞాలు, విధవల సజీవదహనాలు, పవిత్ర ధార్మిక కర్తవ్యాలుగా ముద్రవేసుకున్నాయి. ఈ విధంగా సమాజం రుగ్ణావస్థకు చేరుకుంది. ఈరుగ్ణావస్థ ఆర్థికరంగానికి కూడ వ్యాపించింది. కంపెనీ అనుసరించిన ఆర్థిక విధానం వల్ల దేశంలోని చేతి వృత్తులు మంటగలిశాయి. శాశ్వతకౌలు దారీచట్టం క్రింద జమీందారులు రైతులను పన్నుల భారంతోను, వెట్టిచాకిరీతోను పీల్చి పిప్పి చేస్తూ ఉండడంతో వారు ఆర్థికంగా దుర్భరపరిస్థితులను ఎదుర్కొంటున్నారు.

ఇక ముస్లిం సమాజ పరిస్థితులుకూడ అంతకంటే భిన్నంగా లేవు. 18వ శతాబ్దపు ప్రథమార్ధ భాగం నాటికి ముస్లింలకు పరిష్యా సంస్కృతి, ప్రేరణ స్రోతస్సుగా ఉంటూవచ్చింది. అక్కడ సఫావిద్ సామ్రాజ్య పతనంతో ఈ స్రోతస్సు దాదాపుగా ఎండిపోయింది బాహ్యాగతమైన ఈ సాంస్కృతిక ప్రేరణ అంతరించడంతో ముస్లింలు తమవైపు నుంచి సంస్కృతీపరమైన స్ఫూర్తిని దేశానికి అందజేయలేకపోయారు. అయినప్పటికి సమాజంలో ప్రముఖ స్థానాలను అలంకరించాలనుకునేవారు ఇంకా ఫారసీ భాషను నేర్చుకుంటూనే ఉన్నారు. ఇస్లాం మత వ్యవస్థలో రాజకీయాలు, సమాజం అవినాభావ సంబంధం కలిగి ఉండడం చేత రాజకీయ క్షేత్రంలో మొగలాయి సామ్రాజ్యానికి పట్టిన గ్రహణం ముస్లిం సమాజం మొత్తం మీద వినాశకర ప్రభావాన్ని కలుగజేసింది మతప్రాతిపదికగా ఇప్పటివరకు ఉన్నత పదవులన్నిటినీ తామే చేజిక్కించుకుంటున్న ముస్లింలలోని ఉన్నత వర్గాల వారు మొగలుల పరిపాలన అంతమవడంతో నిరాధారులయ్యారు క్రొత్తగా రూపుదిద్దుకుంటున్న నూతన వ్యవస్థలో నిర్మాణాత్మక దృక్పథాన్ని ప్రవేశపెట్టగలిగిన నాయకుడు ముస్లింలలో కరువయ్యాడు.

ఈ విధంగా సమాజంలోని ప్రతి అంగము పక్షవాతంతో నిశ్చేష్టితమైంది. కుళ్ళి కుంపుకొడుతున్న ఈ సమాజంలో నవచైతన్యాన్ని సంతరింపజేయడం అంటే అది ఒక దుస్సాధ్యంగానే కనిపించుతుంది. సంక్షిప్తంగా రాజా రామమోహనరాయ్ జన్మించినప్పటి భారతదేశ పరిస్థితి ఆవిధంగా ఉంది.

**బాల్యం – విద్యాభ్యాసం :** రాయ్ వంశం బ్రాహ్మణులలో వరిష్ఠమైనది. వారిని కులీనులని పిలవడం కద్దు. అయితే రాయ్ జన్మించడానికి ఒక శతాబ్దంన్నరకు పూర్వమే వారి పూర్వీకులు సాంప్రదాయిక బ్రాహ్మణ జీవిత విధానానికి స్వస్తిచెప్పి మొగలాయి రాజుల కొలువులో ఐహిక జీవన సరళిని అవలంభించి గొప్ప సంపన్నులయ్యారు. రాయ్ పితామహుడు బ్రజబినోద్‌రాయ్ మూర్షిదాబాద్ నవాబుల కొలువులో బాధ్యతాయుతమైన గొప్ప పదవులు అలంకరించి వివిధ సమయాలలో వివిధ జిల్లాలకు ముఖ్య అధికారి అయ్యాడు. రామమోహనరాయ్ తండ్రి రామ్ కాంతరాయ్ గొప్ప సంపద కలిగి జిల్లాలోనే అత్యంత ప్రతిష్ఠితుడైన సజ్జనుడుగా పరిగణింపబడేవాడు. ఆ రోజులలోనే ఆయన ఆదాయం లక్షలలో ఉండేది. ఇకపోతే రాయ్ మాతామహుల వంశీయులు పురోహిత వృత్తిని కొనసాగిస్తూ ధార్మిక నియమ నిబంధనలను భక్తి శ్రద్ధలతో పాటిస్తూ ఐశ్వర్యలిప్సను, యశఃకాంక్షను విడనాడి ప్రశాంత జీవితాన్ని గడపడాన్ని ధ్యేయంగా పెట్టుకున్నారు. వీరుశైవులు. పితామహులదివైష్ణవ సంప్రదాయం. ఈ విధంగా భవిష్యత్తులో ఒక సమన్వయ సంస్కృతికి చిహ్నంగా నిలిచిన రాజారామమోహనరాయ్ పుట్టుకతోనే హిందూమతంలోని రెండు భిన్న శాఖల సమన్వయానికి ప్రతిబింబం. మొగలాయి దర్బారుతో దాదాపు అయిదు తరాల సంబంధం సహజంగానే రాయ్ కుటుంబాన్ని ఇస్లాం సంస్కృతి పట్ల ప్రభావితులను చేసినప్పటికి హిందూమతం పట్ల వారికున్న అచంచల విశ్వాసాన్ని అది ఏమాత్రం తగ్గించలేదు. రాయ్ తల్లిదండ్రులు నిష్ఠాగరిష్ఠులైన హిందువులు. రాయ్‌కూడ బాల్యంలో అదే వరవడిని అనుసరించుతూ వచ్చాడు. కాని ఎప్పుడైతే చారిత్రక మతాలను గురించి గంభీర అధ్యయనము చేశాడో ఆనాటి నుండి హిందూ మతంలో ప్రచలితంగా ఉన్న ఆచారాల పట్ల ఆయన మనస్సులో సందేహబీజాలు అంకురించడం ప్రారంభించాయి.

రాజారామమోహనరాయ్ ప్రారంభిక విద్యాభ్యాసం అప్పటి కులీన సంప్రదాయాన్ననుసరించి ఇంట్లోనే ప్రారంభమైంది. తరువాత ఆయన గ్రామపాఠశాలలో కొంతకాలం విద్యనభ్యసించాడు. ఆరోజులలో ప్రభుత్వోద్యోగాలలో చేరాలనుకునే సంపన్న బ్రాహ్మణ కుటుంబాల విద్యార్థులు ఫారసీ,

అరబ్బీ భాషలు బోధించే పారశాల ( మక్తబ్)లకు వెళ్లి చదువుకునే వారు ఫారసీ భాష అప్పటికి ఇంకా రాజభాషగా ఉంటూ వచ్చింది రామమోహన రాయ్ తండ్రి తనకుమారుని గొప్ప ప్రభుత్వోద్యోగిని చేయాలనే సంకల్పంతో ఒక ఫారసీ మౌల్విని నియమించి ఇంటి వద్దనే శిక్షణ ఇప్పించాడు ఈ విధంగా కొద్దికాలం ఇంటివద్ద విద్యాభ్యాసానంతరం ఆరోజులలో ఫారసీ, అరబ్బీ భాషలకు ఇస్లాం సంస్కృతికి కేంద్రంగా ఉన్న పాట్నా నగరానికి ఆయనను పంపించడం జరిగింది సంస్కృత భాషా సంప్రదాయాలకు నిలయమైన ప్రదేశంలో జన్మించి, హిందూ, ఇస్లాం సంస్కృతులకు సమాన ఆదరణలభించే కుటుంబంలో పెరిగి, అనివార్యమైన విధి ప్రేరణతో అన్యమతాల సంస్కృతీ, సభ్యతలను అధ్యయనం చేయడానికి ఈ విధంగా ఆయన ఇంటి నుండి బయలుదేరడం జరిగింది. భావిజీవితంలో తాను నిర్వహించనున్న పాత్రకు తనను సమాయత్తం చేసుకోవడంలో దీనిని మరొకమెట్టుగా మనం భావించవచ్చు పాట్నాలో అనతికాలంలోనే ఫారసీ, అరబ్బీ భాషలలో సుశిక్షితుడై మహమ్మదీయుల ధర్మగ్రంధం కురానులోను, దానికి సంబంధించిన 63 ధార్మిక శాఖలు, స్మృతుల మీద ప్రకాండ పాండిత్యాన్ని సంపాదించి ఏ మౌల్వీకి తీసిపోని విధంగా ప్రామాణికతను సంపాదించాడు. ఇస్లాం మత మౌలిక విచార ధార ప్రభావం ఆయన మీద గంభీరముద్ర వేసినప్పటికి, సూఫీ సంప్రదాయానికి చెందిన తత్త్వవేత్తల రచనల పట్ల రాయ్‌కి ప్రత్యేక అభిమానం ఉండేది ముఖ్యంగా ఏకేశ్వర వాదులు, హేతువాదులంటే ఆయన ఎక్కువ ఇష్టపడేవాడు ఈ ప్రభావం వల్ల తన 16వ ఏటనే హిందూమతంలో ప్రచలితంగా ఉన్న విగ్రహారాధన ప్రామాణికతను ప్రశ్నించుతూ ఒక చిన్న పుస్తకం వ్రాశాడు. ఫలితంగా బంధువులకు ఆయనకు మధ్య మనస్పర్ధలు ఏర్పడి చివరకు ఆయనను ఇంటి నుండి బహిష్కృతుడయ్యేటట్లు చేశాయి. అయితే అంతకు ముందు నుంచే తండ్రి అధికారాన్ని ధిక్కరించకుండానే విగ్రహారాధన పట్ల ఆయనకు ఉన్న విశ్వాసానికి కారణం ఏమిటో వివరించమని అడిగేవాడు. తన ప్రశ్నకు సంతృప్తికరమైన సమాధానం రాకపోవడంతో ఇల్లు విడిచి వెళ్లడానికే రాయ్ నిర్ణయించుకున్నాడు. విగ్రహారాధనకు వ్యతిరేకంగా ఒక చిన్న పుస్తకము వ్రాసినందుకే కొడుకును ఇంటి నుంచి వెళ్లగొట్టేటంతటి కఠిన నిర్ణయం రాయ్‌కాంత్ ఎందుకు తీసుకున్నాడో వివరిచడం కష్టం మూఢ విశ్వాసాలను పరంపరాగత ఆచారాలను పరమ పవిత్రంగా భావించడమే ఉత్తమశీల సంపదకు గీటురాయిగా భావించబడే ఆరోజులలో రామ్‌కాంత్ తీసుకున్న నిర్ణయం మనకు ఆశ్చర్యాన్ని కలిగించదు. గృహ బహిష్కారానంతరం రామ్‌మోహన్ కొద్దికాలంపాటు దేశాటన చేశాడు. ఇదే సందర్భంలో టిబెట్టును కూడ సందర్శించినట్లు కొన్ని ఆధారాలు కనిపిస్తాయి. మెక్డొనాల్డ్ కథనం ప్రకారం పాట్నాలో ఉండే రోజులలోనే బౌద్ధమతాన్ని గురించి, దక్షిణ భారతంలోను, మధ్య భారతంలోను, హిమాంచలంలోను నివసించే ఆదివాసుల ధార్మిక ఆచారాలను గురించి ఆయన అధ్యయనం చేసినట్లు కనిపిస్తుంది ఈ విధంగా తన యాత్రా జీవితాన్ని ముగించుకొని రామ్‌మోహనరాయ్ వారణాసిలో స్థిరపడ్డాడు.

**ఆస్తిక హేతువాది :** భారతీయ సంస్కృతీ సంప్రదాయాలకు, సంస్కృత విద్యలకు కాణాచియైన వారణాసిలో ఆయన సంస్కృత భాషాధ్యయనంలో నిమగ్నుడయ్యాడు. ఈవిధంగా అచిరకాలంలోనే వేదాలలోని ఒక్క సంహితాభాగాన్ని మినహాయించి మిగిలిన బ్రాహ్మణ సాహిత్యాన్నంతా ఆయన ఆపోశనం పట్టాడు. దీనితో తనకు వారసత్వంగా లభించిన బ్రాహ్మణ సంస్కృతీ సౌధ కవాటాలు ఆయనకు తెరవబడ్డాయి. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత ( ప్రస్థానత్రయం) లు ఆయన

వ్యక్తిగత ధార్మిక, ఆధ్యాత్మిక జీవితాన్ని ప్రభావితం చేసినట్లు ముందు ముందు మనం చూస్తాము ఇస్లాంలోని ఏకేశ్వర వాదం, వేదాంతంలోని అద్వైత వాదం రెండూ ఆయనలో మేళవించి విశ్వాత్మభావనకు పునాదులు వేశాయి రామ్మోహనరాయ్ గొప్ప ఆస్తిక హేతువాది ఇన్ని శాస్త్రగ్రంధాలు చదివిన పిమ్మట, శాస్త్రాలు అంతిమ ప్రమాణాలు కావని, మానవుని ఉత్కృష్ట ఆత్మానుభూతికి పరాలౌకికతత్వం పునాది కాకూడదని, ఆతని చిత్తశుద్ధిపై ఆధారపడిన కర్తవ్య నిష్ఠమాత్రమే ప్రాతిపదిక కావాలనే నిష్కర్షకు ఆయన చేరుకున్నాడు. శాస్త్రాలలో అనేక చోట్ల మనకు హేతువాద దృక్పథం కనపడుతుంది. ఉదాహరణకు యోగవాసిష్ఠంలో ఒకచోట ''పిల్లవాడు చెప్పినా అది సహేతుకమైతే స్వీకారయోగ్యమే. కాని హేతుబద్ధం కాని విషయాన్ని బ్రహ్మదేవుడు చెప్పినా దానిని తృణప్రాయంగా త్రోసిపుచ్చవలసిందే'' అని ఉంది. రాయ్ ఈ సూక్తిని తన జీవితాంతం పాటించాడు అయితే ఆయన సంప్రదాయాన్ని పూర్తిగా నిరాకరించలేదు. సంప్రదాయాన్ని త్రోసి పుచ్చడమంటే చారిత్రక దృష్టికోణాన్ని విస్మరించడమేనని ఆయన అభిప్రాయం. సంప్రదాయాన్ని విచక్షణా రహితంగా వ్యతిరేకించడంగాని, గ్రుడ్డిగా అనుసరించడం గాని రెండూ అభివృద్ధికి ఆటంకాలేనని ఆయన విశ్వాసం. వివేకంతో కూడిన ప్రజ్ఞ మాత్రమే సంప్రదాయ విలువలకు గీటురాయిగా నిలుస్తుంది. 1794 నాటికి తండ్రి పిలుపు మేరకు ఆయన తన వారణాసి జీవితానికి స్వస్తి పలికి ఇంటికి తిరిగివచ్చాడు. ఈ సమయంలో ఆయనకు ఎంతో మంది ఐరోపావారితో పరిచయాలు ఏర్పడ్డాయి. ఈపరిచయాలతో అంతకుముందు వారి పట్ల ఆయనకు ఉన్న కొన్ని దురభిప్రాయాలు తొలగిపోయాయి కాని విగ్రహారాధన, మూఢవిశ్వాసాలు, సజీవ విధవా దహనాల పట్ల ఆయనకు ఉన్నతీవ్ర వ్యతిరేకభావన బ్రాహ్మణ వర్గంతో సంఘర్షణకు దారి తీయక తప్పలేదు. రాయ్ కుటుంబం మీద ఆవర్గం పట్టుబాగా ఉండడంతో ఆయన తండ్రి మరొక్కసారి ఆయన్ని ఇంటి నుండి బహిష్కరించడం జరిగింది అయితే ఈసారి పరిమితంగానైనా తండ్రినుంచి ఆర్థిక సహాయం కొనసాగుతూనే వచ్చింది

**బహుముఖ ప్రజ్ఞాశాలి :** రాజారామమోహనరాయ్ బహుముఖ ప్రజ్ఞాశాలి, బహుభాషాకోవిదుడు. విభిన్నక్షేత్రాలకు విస్తరించిన ఆయన జీవితాన్ని అంచనావేయడానికి సమగ్ర దృక్పథం అవసరం రాయ్‌పేరు చెబితే వివిధ వ్యక్తులలో వారి వారి మానసిక అభిరుచులనుబట్టి వివిధ భావతరంగాలు పెల్లుబుకుతాయి. కొందరి దృష్టిలో ఆయన ధార్మిక సంస్కర్త. మరి కొందరికి ఆయన సంఘ సంస్కర్తగా కనబడతాడు. ఇంకొందరు ఆయన్ని స్త్రీల విముక్తి ఉద్యమ పథ ప్రదర్శకునిగా పరిగణిస్తారు. భారత దేశంలో రాజ్యాంగ సంస్కరణల అభివృద్ధికి, ఆర్థిక వికాసానికి ఆయన చేసిన కృషి చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపబడుతుంది దేశం సర్వతో ముఖాభివృద్ధికి ఆయన వేసిన పునాదుల మీదనే ఒక శతాబ్దంన్నర తరువాత గాంధీజీ భవ్య ప్రాసాదాన్ని నిర్మించాడు. దేశంలో మొట్టమొదటి ముద్రణాలయాన్ని స్థాపించిన ఘనత కూడ రాయ్‌కే దక్కుతుంది. ఆధునిక బెంగాలీ రచనకు ఆయన ఆద్యుడు. భారతదేశ చరిత్రగతిని మార్చిన విద్యా సంస్కరణలకు నాందీ ప్రస్తావన చేసిన అగ్రదూత కూడ ఆయనే. రాయ్‌కి పూర్వం జన్మించిన మహానుభావులతో పోల్చి చూసినప్పుడు ఆయన విలక్షణత మనకు బోధపడుతుంది. విశాల దృక్పథంలోను, సహానుభూతిలోను, సర్వతో ముఖప్రతి భావ్యుత్పత్తులలోను, కార్యక్రమాల వైవిధ్యంలోను, భావ సమ్మేళనంలోను, సమగ్ర జీవిత సాఫల్యంలోను ఆయన విశిష్ట వ్యక్తిత్వం కొట్టవచ్చినట్టు కనబడుతుందని రఘుపతి వెంకటరత్నం నాయుడు ఒకచోట అంటాడు. ప్రతి రంగంలోను ఆయన సాధించిన విజయాలు ఆయనకు శాశ్వత

కీర్తిని సమకూర్చి పెట్టాయి. వాటిలో ఏదో ఒకరంగాన్ని వేరుచేసి చూడడం ఆయన గొప్పతనాన్ని మరుగుపరచడమే అవుతుంది. ఎందుకంటే రాయ్ సాధించిన విజయాలకంటే ఆయన వ్యక్తిత్వం మహోన్నతమైంది. దేశ పరిస్థితులవైపు ఒక్కసారి ఆయన దృష్టిని సారించగానే అస్పష్టంగా మినుకు మినుకు మంటున్న భూతకాలం, భిన్న సంస్కృతుల సంఘర్షణతో సతమతమవుతున్న వర్తమానం, సంప్రదాయపు వత్తిడి, మార్పుచెందవలసిన ఆవశ్యకత, ఆత్మప్రబోధం, బౌద్ధికశక్తుల అభివ్యక్తీకరణ మొదలైనవన్నీ ఆయన హృదయపటలం మీద తమతమ భిన్నత్వంలో ఏకత్వాన్ని సాధించుకున్నాయి.

ఆంగ్లేయులు భారత దేశంలో అడుగు బెట్టిన రోజులలో ఇంగ్లండు జనాభా 15 మిలియన్లు (కోటిన్నర) అప్పటి భారత దేశజనాభా (నేటి భారతదేశం, పాకిస్తాన్, బంగ్లాదేశ్, మ్యాన్‌మార్, శ్రీలంక దేశాలన్నీకలిపి) మొత్తం 150 మిలియన్లు (15 కోట్లు) కోటిన్నర మంది 15కోట్ల మందిని పరిపాలించేస్థాయికి ఎందిగారంటే వారి సంఘటనాశక్తి, విద్యావైశద్యం, సాహస ప్రవృత్తి, సునిశిత మేధా సంపత్తులే అందుకు ప్రధాన కారణమని అందరికంటే ముందుగా గ్రహించినవాడు రామ్‌మోహనరాయ్. వారి విద్యా విధానంలోనే ఈ గొప్పతనం ఉందని ఆయన ప్రగాఢవిశ్వాసం. అందుచేత భారతదేశంలో ఇంగ్లీషు విద్యావిధానాన్ని ప్రవేశపెట్టించడానికి ఆయన ఎంతో కృషి చేశాడు. మొదట్లో కంపెనీవారు (ఈస్ట్ ఇండియా కంపెనీ) భారతదేశంలో ఇంగ్లీషు విద్యలను ప్రవేశపెట్టడానికి సుముఖంగా లేరు. వారి విముఖతకు ప్రధాన కారణాన్ని కంపెనీ డైరెక్టర్లలో ఒకరి కధనం స్పష్టంగా తేటతెల్లం చేస్తుంది ''అమెరికాలో స్కూళ్లు, కాలేజీలు స్థాపించి మనం చేసిన పొరపాటు తిరిగి భారత దేశంలో పునరావృత్తం కాకూడదు'' (అమెరికా వారు విద్యావంతులై ఇంగ్లీషు వారి మీద సాయుధ తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నారు. డైరెక్టర్ కథనం ఈ విషయాన్నే సంకేతిస్తున్నది) అని ఆయన గట్టిగా వాదించాడు. ( ఇంగ్లీషు వారు భారతీయులను గుమాస్తాలుగా తయారుచేసి తమసేవకు వినియోగించుకోడానికి ఇక్కడ ఇంగ్లీషు విద్యను ప్రవేశపెట్టారు అని విశ్వసించేవారు ఈ చారిత్రక సత్యాన్ని గుర్తిస్తారని ఆశిద్దాము)

**ఇంగ్లీషు విద్యావిధానం – రాయ్ అవిరళ కృషి :** లార్డ్ మింటో గవర్నర్ జనరల్‌గా ఉన్నప్పుడు కంపెనీ వారు స్థాపించాలనుకున్న కాలేజీలు కేవలం సంస్కృతం, ఫారసీ భాషలను బోధించడానికి ఉద్దేశించినవే కావడం విశేషం. ఇంగ్లీషువారిలో సంస్కృత భాషలో ఉద్దండ పండితులనదగిన సర్ విలియంజోన్స్, ( ఈయన కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం నాటకాన్ని ఇంగ్లీషులోకి అనువదించాడు) డ్యాక్టర్. హెచ్. విల్సన్, మిస్టర్ కోల్‌బ్రూక్, ప్రిన్సెస్ సోదరులు - టోబీ, జేమ్స్‌లు మింటోకు సలహాదారులుగా ఉండేవారు. ఆరోజులలో ఇంగ్లీషు అధికారులు సంస్కృత జ్ఞానాన్ని ఒక విశిష్ట గౌరవ చిహ్నంగా భావించేవారు. ఈ దృష్టితో ప్రాచ్య భాషలను బోధించే ఉద్దేశ్యంతో 1800లో కలకత్తాలో ఫోర్ట్ విలియంకాలేజి ప్రారంభించబడింది. సాంస్కృతిక విలువలకు సంబంధించి సంస్కృతం, ఫారసీ భాషల ప్రాధాన్యాన్ని రామ్‌మోహన్‌రాయ్ గుర్తించినప్పటికి ఆధునిక యుగపు అవసరాలను అవి ఎంత మాత్రం తీర్చలేవని ఆయన నిశ్చితమైన అభిప్రాయానికి వచ్చాడు. బ్రిటిష్‌వారిద్వారా భారతదేశం మీద పడిన పాశ్చాత్య ప్రభావానంతరం అది తన పూర్వ స్థితిలో ఎంత మాత్రం మనుగడ సాగించలేదని ఆయన గ్రహించాడు. అందుచేత విజ్ఞానోన్ముఖమైన విద్యావిధానాన్ని ప్రోత్సహించి భారత దేశంలో

పునర్జాగరణ ఉద్యమానికి దోహదపడాలని ఆయన మనస్ఫూర్తిగా ఆకాంక్షించాడు. అందుకే ప్రభుత్వం బూజుపట్టిన పురాతన విద్యావిధానాన్ని పట్టుదలతో కొనసాగించడం ఆయనకు ఎంతో బాధకలిగించింది. అందుకు నిరసనగా అప్పటి గవర్నర్ జనరల్ లార్డ్ అమ్హెర్స్ట్‌కు 1823 డిసెంబరు 11న ఆయన ఒక లేఖ వ్రాయడం జరిగింది. ఆ లేఖ పూర్తిపాఠం ఈ క్రింది విధంగా ఉంది - ''భారత దేశంలో ఇప్పటికే అమలులో ఉన్న జ్ఞానాన్ని బోధించడానికి సంస్కృత పండితుల ఆధ్వర్యంలో సంస్కృత పాఠశాలను ప్రభుత్వం స్థాపించడం గమనించాము. ఈ ధర్మ ప్రశిక్షణ పాఠశాల ( లార్డ్ బేకన్ కాలానికి పూర్వం ఐరోపాలో ఉన్న పాఠశాలల స్వభావం కలిగిన పాఠశాల - అంటే ఒక రకంగా మతబోధ పాఠశాల) వ్యాకరణం, ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించి సూక్ష్మాతి సూక్ష్మభేదాలను విశ్లేషించుతూ సమాజానికి ఏమాత్రం ఉపయోగ పడని జ్ఞానభారాన్ని విద్యార్థుల మనస్సులపై మోపుతుంది. భారతదేశంలో ఇటువంటి జ్ఞానం గత రెండు వేల సంవత్సరాలుగా ఏమార్పులేకుండా నిరాఘాటంగా కొనసాగుతూ ఉంది. దీనికి తోడు కాల్పనిక జగత్తులో విహరించే కొందరు మీమాంసకులు తమంత తాముగా చేర్చిన నిరుపయోగమైన, అతి సూక్ష్మమైన మార్మిక భేదాలు ఆవిద్యలో భాగంగా ఉంటాయి.''

''బ్రిటిష్ జాతిని అజ్ఞానంలో ఉంచాలనుకున్నట్లయితే మత గురువుల పాఠశాలల స్థానంలో బేకన్ ప్రతిపాదించిన విద్యా విధానాన్ని ప్రవేశపెట్టి ఉండే వారుకాదు. అదే విధంగా భారతదేశాన్ని అంధకారంలో ఉంచడమే బ్రిటిష్ ప్రభుత్వం విధానమైతే సంస్కృత విద్యా విధానాన్ని ప్రవేశపెట్టడం వల్ల ఆపని సులువుగా నెరవేరుతుంది.''

''భారతీయుల వికాసమే ప్రభుత్వం లక్ష్యం గనుక సర్వజనులకు అందుబాటులో ఉండి, వారిలో స్వతంత్రచింతనకు పురికొల్పే భావ స్ఫోరకమైన శిక్షణా విధానాన్ని అదిప్రోత్సహించాలి. ఈ శిక్షణా విధానంలో గణితశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయనిక శాస్త్రం, జీవ విజ్ఞాన శాస్త్రంతో పాటు ఇంకా ఇతర ఉపయోగకరమైన శాస్త్రవిషయాలన్నీ సమాకలనం చెందుతాయి. ఈ విద్యలను బోధించడానికి ఐరోపా దేశంలో విద్యనభ్యసించిన ప్రతిభావంతులైన అధ్యాపకులను నియమించాలి. అందుకు అన్ని హంగులతో కూడిన ఒక కాలేజీని ఏర్పాటు చేయాలి''.

**నవయుగ శంఖారావం :** రామ్‌మోహనరాయ్ ఎంతటి దూరదృష్టి గలవాడో, తన సమకాలీన ఆలోచనలకంటే ఆయన ఎంత ముందు ఉంటాడో తెలుసుకోడానికి ఈక్రింది విషయాలు మనకు దోహదపడతాయి. ఆయన లార్డ్ అమ్హెర్స్ట్‌కు వ్రాసిన లేఖ తరువాత 13సంవత్సరాలకు గాని ఇంగ్లాండులో కెమిస్ట్రీకాలేజీ స్థాపన జరగలేదు. 37 సంవత్సరాలకు గాని లండన్ యూనివర్సిటీలో ఫాకల్టీ ఆఫ్ సైన్స్ ఏర్పడలేదు. 50సంవత్సరాలకు గాని ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిజ్ యూనివర్సిటీలలో సైన్స్ విభాలకు సంబంధించిన పీఠాలు స్థాపింపబడలేదు. దీనిని బట్టి ఆయన భారతీయులకే గాక, ఇంగ్లీషువారికి కూడ మార్గదర్శకుడుగా ఉన్నాడంటే ఆశ్చర్యం కలుగక మానదు. అయితే భారతదేశంలో ఇంగ్లీషు విద్యను ప్రవేశపెట్టడానికి ఇంకా ఎంతో శ్రమించవలసి వచ్చింది. బ్రిటిష్ పార్లమెంటులో లార్డ్ మెకాలే చేసిన ప్రసంగం ఈ దిశలో ఎంతో ప్రాముఖ్యం వహిస్తుంది. ఎట్టకేలకు లార్డ్ విలియం బెంటిక్ గవర్నర్ జనరల్‌గా ఉన్నకాలంలో లార్డ్ మెకాలే ఆయనకు న్యాయ సలహాదారుగా ఉన్నతరుణంలో ఈ కార్యం సిద్ధించింది. అది 1885వ సంవత్సరం అప్పటికి రాయ్ గతించి రెండు సంవత్సరాలైంది. ఈ

విధంగా తన అవిరళకృషి వల్ల భారతదేశంలో ఇంగ్లీషు విద్యను ప్రవేశపెట్టించి దేశానికి ఒక చరిత్రాత్మకమైన దిశానిర్దేశకత్వాన్ని ప్రసాదించిన మహనీయుడు రామ్‌మోహనరాయ్. దీనివల్ల దేశానికి ఎంతటి ప్రయోజనం చేకూరిందో అందుకు చరిత్రే సాక్షి

**మూఢాచారాల నిర్మూలన :** ఇక సామాజిక రంగంలో ఆయన సేవలు చిరస్మరణీయాలు. సామాజిక మూఢాచారాలను శాస్త్ర సమ్మతమైనవిగా ప్రచారం చేస్తూ దయ, కరుణ మొదలగు మానవతా భావాలకు తిలోదకాలిచ్చి నిస్సహాయులైన విధవలను సజీవ దహనం చేసే ఒక పైశాచిక సంప్రదాయానికి భరత వాక్యం పలికిన ఘనత రామ్‌మోహన రాయ్‌కే దక్కుతుంది దీనికి కూడ సనాతన పండితుల కరుడుగట్టిన కాఠిన్యాన్ని ఆయన ఎదుర్కోవలసి వచ్చింది అంతేగాక ఇది శాస్త్ర సమ్మతమని వారుచేసే వాదనను శాస్త్ర విజ్ఞానంతోనే ఎదుర్కొని ఇటువంటి పాశవిక ఆచారానికి ధర్మశాస్త్రం ఎక్కడా ఆమోదం తెల్పలేదని ఆయన నిరూపించి లార్డ్ బెంటింగ్‌తో సతీసహగమన నిషేధచట్టాన్ని ప్రవేశపెట్టించి అమలు జరిపించాడు

**రాయ్‌భాషా సేవ :** ఇక భాషా పరంగా బెంగాలీ గద్య సాహిత్య వికాసానికి ఆయన చేసిన సేవ అవిస్మరణీయం. రామ్‌మోహన రాయ్‌కి పూర్వం బెంగాలీ సాహిత్యంలో గద్యానికి తావులేదు. అది అవికసితావస్థలో స్థిరమైన ఆకృతి లేక, లావణ్య రహితంగా, సంస్కృత పదభారంతో సువ్యవస్థితమైన భావాలను వ్యక్తం చేయడానికి వీలులేకుండా ఉండేది అటువంటిది రామ్‌మోహనరాయ్ కలం స్పర్శతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దబడి ఎంతటి సూక్ష్మ సుకోమలమైన మార్మిక భావాలను కూడ సమర్థంగా వ్యక్తీకరించే స్థాయికి చేరుకుంది. రాయ్ మొదటి బెంగాలీ గద్యకృతి ''వేదాంత గ్రంథం'' ఈ గ్రంధ రచనకు ముందు ఉపనిషత్తులలో వ్యక్తీకరించబడిన ఉత్కృష్ట తాత్విక భావాలను బెంగాలీ గద్యంలో అభివ్యక్తం చేయడానికి వీలుంటుందంటే ఎవ్వరూ నమ్మలేకపోయేవారు. రాయ్ సృష్టించిన ఈ బెంగాలీ గద్యం అంతకు ముందున్న గద్యంతో పోలిస్తే ఒక గుణాత్మకమైన మార్పుకు శ్రీకారం చుట్టింది. ఈ విధంగా ఆయనను ఆధునిక బెంగాలీ గద్య సాహిత్యానికి ఆది ప్రయోక్తగా భావించవచ్చు. బెంగాలీ వాక్య రచనా విన్యాసానికి సంబంధించి ఆయన కొన్ని నియమాలను రూపొందించాడు ఇందుకోసం ఆయన బెంగాలీ భాషలో మొట్టమొదటి వ్యాకరణ గ్రంథాన్ని ''గౌడీయ వ్యాకరణం'' అనే పేరుతో రచించాడు. వ్యాకరణం అనేది భాషను ఉక్కుచట్రంకలో బంధించేది కాదని, దాని నిర్మాణ స్వరూప స్వభావాన్ని బహిర్గతం చేసే సాధనమని ఆయన స్పష్టంగా ప్రకటించాడు. ఈ విధంగా ఎన్నో గ్రంథాలను రచించి, మరెన్నో పత్రికా వ్యాసాల ద్వారా ఆయన ఆధునిక బెంగాలీ గద్య సాహిత్యాన్ని సుసంపన్నం చేశాడు. రాయ్ వేసిన ఈ పునాదుల మీదనే బంకిమ్ చంద్ర చటర్జీ, ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ప్రభృతులు ఒక భవ్యమైన బెంగాలీ సాహిత్య సౌధాన్ని నిర్మించారు తరువాతి కాలంలో రవీంద్రనాథ్ టాగూరు బెంగాలీని ఉన్నత శిఖరాలకు చేర్చి దానికి ప్రపంచ భాషా స్థాయిని కల్పించాడు

**విశ్వమానవ సౌభ్రాతృత్వమే ఆయన మతం :** మత సంబంధమైన విషయాలకు సంబంధించిన సృష్టికర్త ఒక్కడేనని, ఆయనను ఏ పేరుతో పిలిచినా ఆయన మౌలిక స్వభావంలో మార్పేమీ ఉండదని రామ్‌మోహనరాయ్ విశ్వసించాడు. ప్రపంచంలోని మత గ్రంథాలన్నింటినీ అధ్యయనం చేసిన పిమ్మట వాటి అన్నింటిలోను అనుస్యూతంగా ఉన్న ఏకైక భావన ''భగవంతుడు ఒక్కడే''నని, పూజా

పురస్కారాల వంటి బాహ్యాడంబరాలు మతంలో ఎంత మాత్రం భాగం కావని చాటిచెప్పి ఆయన ఏకేశ్వర వాదాన్ని ప్రోత్సహించాడు. తాను స్థాపించిన బ్రహ్మ సమాజ మందిర కవాటాలను 'ఆది మధ్యాంతరహితుడు, శాశ్వతుడు, సనాతనుడు, నిర్వికల్పుడు' అయిన భగవంతుని ఆరాధించాలనుకునే వారందరికీ తెరచి ఉంచాడు. వాస్తవానికి రాజారామమోహనరాయ్ ఒక విశ్వమానవుడు. ఆయన్ని ఒక కులం, మతం, భాష, దేశకాల పరిధులలో బంధించాలని చేసే ఏ ప్రయత్నమైనా ఆయన విశ్వ జనీన దృక్పథాన్ని కుంఠితపరుస్తుంది. సంకుచిత దేశభక్తి, సానుభూతికి పరిమితులు విధించడం, జాత్యహంకారం, మత దురభిమానం, సైద్ధాంతిక రూఢివాదం, ధార్మిక కర్మకాండలు సృష్టించే అవరోధాలు, వివిధ పూజావిధానాలు, మానవతాభివృద్ధికి ఆటంకాలుగా నిలిచాయని ఆయన గ్రహించాడు. విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని సాధించాలని లక్ష్యంగా పెట్టుకున్న వారెవరైనా ముందు వీటికి అతీతులుగా ఉండాలని ఆయన ప్రగాఢ విశ్వాసం. ఈ ఆదర్శ సాధన కొరకే ఆయన తన జీవితాన్ని కైంకర్యం చేశాడు. ''సమకాలీన ప్రపంచంలో ఆధునిక యుగం మహత్వాన్ని గుర్తించిన ఏకైక మానవుడు రామ్మోహనరాయ్. మానవనాగరికతాదర్శం ఎవ్వరితోనూ సంబంధం లేకుండా విడివడిన స్వాతంత్ర్యంలో లేదని, పరస్పరాధార భూతులైన వ్యక్తుల, జాతుల మధ్య నెలకొనే సౌభ్రాతృత్వంలోనే ఉందని ఆయన విశ్వసించాడని'' రవీంద్రుడు ఒకచోట అంటాడు.

**నిరంకుశత్వం పట్ల నిరసన :** ప్రపంచంలో నిరంకుశ శక్తులకు వ్యతిరేకంగా ఎక్కడ పోరాటాలు జరిగినా రామ్మోహన రాయ్ వాటికి తన సానుభూతిని తెలిపాడు. ఈ దృష్టితోనే స్వాతంత్ర్యం కోసం బోర్బన్ రాజులకు వ్యతిరేకంగా నేపుల్స్ ప్రజలు జరిపిన పోరాటానికీ, టర్కీ పాలన నుండి విముక్తి పొందడానికి గ్రీకు ప్రజలు సలిపిన సంఘర్షణకు, లాటిన్ అమెరికా ( దక్షిణ అమెరికా) ప్రజలు వలస పాలనకు వ్యతిరేకంగా సాగించిన ఉద్యమాలకు ఆయన తన సాను భూతిని తెలిపాడు. బ్రిటిష్ వారు ఐర్లాండును ఆక్రమించుకోడాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తూ తాను సంపాదకత్వం వహిస్తున్న పారసీ భాషా పత్రిక ''మిరాత్ - ఉల్ - అక్బర్''లో వ్యాసం వ్రాశాడు. ఐర్లాండ్ దేశపు కరవు బాధితులకోసం ధనసహాయాన్ని సమకూర్చి పెట్టాడు. 1821లో స్పెయిన్‌లో రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వం ఏర్పడిందన్న వార్తకు స్పందించి కలకత్తా టౌన్‌హాలులో విందు ఏర్పాటు చేశాడు. ఈ విందు ఏర్పాటుకు సంబంధించి మిత్రులు అడిగిన ప్రశ్నకు 'తోటి మానవులు వారేమతానికి చెందినా, ఏ భాష మాట్లాడే వారైనా, ఏ దేశవాసులైనా వారి బాధలకు స్పందించకుండా ఎలా ఉండగలనని' సమాధానం చెప్పిన మహా మానవుడు ఆయన. స్పెయిన్ రాజ్యాంగం 1812లో ఆమోదింపబడినప్పుడు ఈ క్రింది మాటలతో అది ఆయనకు అంకితమివ్వబడింది - ''అత్యంత ఉదారుడు, కులీనుడు, వివేకి, సద్గుణ సంపన్నుడు అయిన రామ్మోహనరాయ్ బ్రాహ్మణునకు సాదరంగా సమర్పితం. ఎక్కడి స్పెయిన్! ఎక్కడి బెంగాలీ బ్రాహ్మణుడు! చరాచర జగత్తునంతా ఆత్మ భావనతో చూడగలిగిన వానికి దేశకాల పరిస్థితులు అడ్డుగోడలు అవుతాయా? పంచభూతాలను తనలో సమపాళ్లలో సమాహృతం చేసుకున్న ఈ విశ్వ మానవుని కీర్తి చంద్రికలు మానవాళి ఉన్నంతవరకు అమృతపు జల్లులను కురిపిస్తూనే ఉంటాయి.



*Gustave Moreau's Oedipus and the Sphinx, painted in 1864*